యంబు లొసంగి సుబ్రహ్మణ్యుం డాక్షణంబ. ౧౮౧

క. సారథియైన సమీరుని, నేరుపు దెప్పని ప్రియమాణ దీపిత మతియై
ధీరత తేలుచు గాంచియు, పారబలాధ్యక్షుండు వీరబాహుడు వేగన్. ౧౮౨

వ. సత్యజ్ఞానానంద లక్షణుండగు స్కందుని పాదారవిందంబుల కెరగి నాక
నజ్ఞ నొసంగు మేను సంగరాంగణంబున సకల శత్రుభంగంబు గావించి వ
చ్చెద ననిన విని గుహుండు మంద హాసవిలసిత ముఖారవిందుండగుచు
సాహసంబున కనుజ్ఞ నిచ్చిన నతండు నిజగృహంబునకుం జనుదెంచి. ౧౮౩

— సింహముఖుడు దళములను సంహరించుట. —

మ. ధృతనానాయుధుఁడై విభూషణ లసద్దివ్యాంబరోపేతుఁడై
యతుల ప్రౌఢిరథంబు నెక్కి జవనాశ్వాఢ్యుల్ సాహసా
న్వితులష్టాధికలక్ష వీరులును తో విందోడనూపం మహో
ద్ధతి నేతెంచెను వీరబాహుఁడు సమిద్రంగంబు సేరంగడున్. ౧౮౪

వ. అయ్యవసరంబున సహస్రాక్షౌహిణీ సంఖ్యంబులగు సకలభూతంబులును స
ర్వాయుధ సమేతంబులై తోడనం జనుదెంచె నంతయు. ౧౮౫

క. సేనాంభోధిపపరాగము, భానుం గబళించె మొరసె భయసంబుగ భే
రీనిస్సాణ స్వనములు, మానిత కేతనము లభ్రమండలి మెరసెన్. ౧౮౬

వ. ఇట్లు చనుదెంచి యసురబలంబులం గవిసిన య య్యుభయదళంబులు ప
రస్పర హుంకార భయంకరంబులును ప్రకటిత భేరీభూరి భాంకార పూ
రిత హరిన్ముఖరంబులును ప్రస్ఫురిత ధనుర్జ్యాటంకార భీషణంబులును, ప్ర
సారిత నానాస్త్ర ఘంటాఘణ ఘణాత్కార ఘోషితంబులును, పరిభ్రాజి
త కేతన పటపటాత్కార భయానకంబులును పరిభ్రమ రథనేమీనినద భ
యదంబులును, పవనజవనకంఖాణ హేషారవ భైరవంబులును, ఘటగజ
ఘటాబృంహితధ్వాన భాసురంబులు నగుచుఁ బర్వతోపలభూరుహంబులు
గురియుచు నిశితవిశిఖంబులు నిగుడించుచుఁ బరశుపట్టిస కరవాలశూలను
లిశ తోమరాదులు పరపుచు ఘోరంబుగాఁ బోరునవసరంబున. ౧౮౭

క. దనుజులు రణకోవిదులై, మునుకొనితమ్మక్ష్మాశైల ముఖభూరుహముల్
దునిమిదిగంత వ్యాప్తం, బునకుఁ దరిమి రథులఘాత కుంజరములు సడిన్

వ. ఇట్లురక్కసులచేత నుక్కఱడి వెనలమఱదిరిగి చనుచూకలంగని నిలునిలుం
డని చెయివీచి నిజబలంబులం బురికొలిపికొని భూతసేనావిభుండగు సిం
హుండు సింహనాదంబుసేయుచు మదగజంబుపై కురుకు కోదమసింహం
బువోలె నసురవీరుల పయింగవిసి వెంశ మహోద్దండ దండంబునరిపుసంఘ
లంబుఁ జెండి దండధరు దండకనిపెనంత. ౯౯

క. పరిశౌర్యుఁడు దశముఖుఁడును, సురవైరి చమూవిభుండు • శుంభద్గతిచే
నరుదెంచి రోషమునరుగ, శరవితతుల సింహునేసె • సమరక్షోణిన్. ౯౨

వ. భూతసేనావిభుండు నవియన్నియు దండంబునం జెండి వెండియుఁ గోపంబ
డర దానను దద్వక్షంబుపై వైచిన నావేల్మిటుసం గవచంబు నుగ్గునూచం
బు నయ్యె నంత దానవుండు ప్రతిదండంబుం గని యుద్దండంబుగాఁ గే
లం ద్రిప్పుచు సింహునివక్షస్థలంబుపై వైచిన. ౯౫

క. దంభముతత్పటువక్షో, మండలి సంఘృష్టిరేణు • నుయమై పడియెన్
మెండొడ్డిమటీయునునుజవ, గుంఠపరశువు నుంబరపె • రోష భరితంబడరన్.

వ. అప్పుడప్పరశువును భూతసైన్యాధిపుండుదండంబునం జూర్ణంబుగావించితూ
ర్ణంబుగా నతని బాణాసనంబుదునిమిన. ౯౩

క. దానవుఁ డతికోపోజ్వల, మానసుఁడై శక్తిఁ బరపె, మహిమ సెలంగన్
దానికి భూతగణాగ్రణి, మానిత చక్రిమునఁ దునిమె • నుగటిమి దనరన్.

వ. అంతదానవుండు ఖండితంబగు శక్తిం గని ప్రచండ కోపంబున మండుచు
దోర్దండంబున వేరొండు దండంబునుంగొని దండధరుని పగిది నుద్దండంబు
గా భూతసేనావిభుం జెండిన నతండు రుధిరంబు దొరుగ నిమిషమాత్రం
బూరకుండి వెండియు నరుదెంచి కినుక జనింప రెండుచేతుల దండంబులు
గీలించి దశముఖు యురంబుఁ జిదిపె నంతయు. ౯౫

ఆ. అద్దురాత్ముఁ డప్పు • డాననంబున రక్తధారలొలుక ధరణి • ధరము వోలె
ధరణిఁ గూలె నిర్గతప్రాణుఁడైయంత, నసురులెల్లగవిసి • రతనిమీద. ౯౬

—• కననుని నిశాతాస్త్రంబులఁ జూచి యసురులు పారిపోవుట. •—

వ. ఇట్లు రక్కసులు పెక్కండ్రొక్క మొగి సమ్మొహపీడుండగుసింహునిపయిం
గప్పియునెడ మహాబలుండును శ్రీమంతుండును ఒక వీరులలోనుండి కనకనా

భుండగు కనకుండడసొచ్చి కనకపుంఖంబులగు నిశితసాయక నికరంబులుగ్ని కరం బెడల నెడలం బరపినం గని తక్కిన నికరంబు భయం బడి కంపింగులచు నసురులు నలుదెసలకుం బరచి రంత. ౧౯౭

—॰ దుర్ముఖుండు పలాయనుం డగుట. ॰—

ఉ. దానవసైన్యనాయకుండు ॰ దారబలాఢ్యుండు దుర్ముఖుండు కోపానల భాసమానుండయి ॰ యద్దనుజ వ్రజమెల్ల దిప్పి గర్జానినదంబులొప్ప నిత ॰ సాయకముల్ గురిసెన్ రణోర్విసంతేని భుజావరాక్రిమ పి ॰ నిర్జిత భాస్కరకోటి తేజుండై. ౧౯౮

వ. అత్తరి భూతంబులు మొత్తంబులై మహారవంబు లొనర్చుచు భూధర భూరుహ శిలాప్రకరంబు లద్దురాత్ముని పయిం గురిసె. అద్దుర్ముఖుండుకోరిధారుణ ముఖుండగుచు శతధాదళిత గాత్రుండై రణవంచకుండు గావున భూతసైన్యంబును మాయగప్పె నప్పు డతిపాపాత్ముని మాయం దెలిసి వీరమార్తాండుండు నరుదెంచి జ్ఞానాస్త్రంబు సంధించె నంతయు.

తే. అంత దానవ విభుండు మాయను దొలంగి, యులుక పొడమంగ నెక్కండె ॰ యాజిలోన
నిలచి బాణసహస్రంబు ॰ నిష్ఠురముగ, బరపెనవ్వీరుపై భుజ ॰ ప్రౌఢి మెరయ.

తే. వీరమార్తాండుండు సహస్ర ॰ విశిఖములను, వానిధనువునుఖంఒంచి ॰ వాడిములికిసవియుం దునుమాడి సప్తవిశి ॰ ఖాస్త్రములను, గంచుకంబును గడువ్రిక్కలించి యపుడు. ౨౦౧

వ. మఱియు నిశిత విశిఖంబు లతని గాత్రంబు నెప్పించిన దానవుండు రక్తసిక్తాంగుండగుచు యొల్లంబోవుచు నొక్కింత సేపు మూర్ఛాక్రాంతుండై మరల దెప్పిరిలి యమ్మహామహునితోడ కయ్యంబున కియ్యకొనక చయ్యన మాయ నదృశ్యుండై పలాయనంబు నొందె. అట్లగుటం గనుంగొనిదనుజసైనికు లందఱు యథాయథంబుగాం బారుటం జూచి భూతంబులు విజయసమేతంబులై పరాజితులతోడ ననుసరంబు సేయందగదని సింహనాదంబు లొనర్చుచు మరలె నప్పుడు. ౨౦౨

—॰ సింహవక్త్రుండు యుద్ధమునకు విజృంభించుట. ॰—

క. దనుజులు పలాయనంబుగ, గని సింహముఖుండు వేగగమరోషమునన్

జనుదెంచి భయదగర్జా, ధ్వను లడరగ సమరమునకుఁ ♦ దారుణపటిమన్.

వ. ఇట్లుసదెంచు పర్వతోపమానకాయుండును మహాభీముండును సింహనాద ముఖరితదిఙ్ముఖుండునునగు సింహముఖుం గని భూతప్రేతంబులుత్తుంగంబుల గుమహీధరతరుఖండంబులు గురిసినసద్దానవుని కరాస్ఫాలనంబునం గంపితం బులై తరుగిరులు కొన్ని చూర్ణంబులై యెగసి తారాగ్రహమార్గంబుఁగ ప్పె. కొన్ని చిద్రుపలై నేలంబడిన నచట సింహవ్యాఘ్రాది మృగంబులుం బెదిరి నలుదెసలుం బరపె నప్పుడు. ౨౦౪

శా. భూతవ్రాతము భూరిభూరుహనగంబుల్ నింపఁగాఁ జూచి సు
జాతక్రోధత తేప డిగ్గి యసురుం ♦ డుండప్రతాపంబునన్
దై తేయాధిపుఁ డమ్మహీధరములు ♦ దృత్పాలజాలంబులన్
జేతం బట్టి జవోన్నతిన్ బరపె నా ♦ జంగొన్ని భూతాళిపై. ౨౦౫

వ. మఱియుఁ బ్రచండరోషంబున నన్నిశాచరుండు భూతంబులం గొన్నింటినిఁ గేలం గేలించి నేలం గొట్టి కొన్నింటిని సూర్యరథంబునఁ బర్వతసముద్రద్వీ పంబులం గొన్నింటినిం బడవైచియు వెండియు జలంబు రెట్టింపఁ గొన్నిం టిని ముష్టిప్రహారంబులం బొడిచియుఁ గొన్నింటిని ప్రియ్యాలు గావించియు బ్రహ్మాండకటాహంబు దాటం గొన్నింటిని నెగయవేసియుఁ గొన్నింటిని బి రబిరం ద్రిప్పి దెప్పరంబుగా మోదియు బ్రహ్మవిష్ణుప్రభృతిలోకంబులఁ దొ రఁగ గొన్నింటిని వడిం జిమ్మియుఁ గొన్నింటి నింద్రాది దృష్టదిక్పాలకుల సదనంబులం బడఁ గెడపియు బడబానలంబునం గొన్నింటినిఁ గూలంద్రో చియుఁ గొన్నింటినిఁ బాతాళంబునం బడద్రోచియుఁ గొన్నింటినిం దుని మియు భూతంబుల నరపియు నమ్మహాబలుండు భూతప్రేతంబుల సకలది శలు సర్వభువనంబులు నించి మించిన రోషంబునం జరణతలంబున మెది పియుం జిదిపియు మేచియు బ్రేరేచియు శిరంబులుం ద్రెంచియుహా షే క్షణంబుల నవలోకించియు హుంకారంబుల భర్జించియుం గరతలంబుల న లినలిగావించియుఁ గోపంబునం గరగరనమిలియు మగుడ నద్దురాత్ముండు పరశుపట్టిసముసలముద్గరకరవాలశూలాద్యాయుధంబుల జక్కుణంచియు నుక్కుమిగులం గులాచలంబులుం బ్రయోగించి నుగ్గునూచంబులు సేసి యు నిట్లు ననేకభంగుల సంగరాంగణంబున భూతంబు లన్నింటినిం బరిమా ర్చె నంతయు. ౨౦౬

క. అపుడు హరిబ్రహ్మాదులు, విప్రలభయభ్రాంతులగుచు । వేగము చని రా
జిపలాయనమ్ముం బొందుచు, నపరిమితానందులైరి । యసురులు పేర్మిన్.

— । అగ్నికోపుఁడు సారథిని సంహరించుట । —

వ. సింహవక్త్రుం డంత మరల నతిసుందరరథారూఢుండయ్యె నయ్యెడ నగ్ని
కోపుండను భూతేశ్వరుండు సనుదెంచి కోపాటోపంబున నిజపరాక్రమం
బుం బ్రకటింపుచు మహాభీలంబును నతిదృఢంబును నగు శూలంబు సుర
విరోధిపైఁ బరపిన నదియు నతని వక్షంబునం బడి భగ్నంబయ్యె నయ్య
వసరంబున. ౨౦౮

ఆ. మఱియు భూతవరుఁడు । మునికోప మొదవంగ, సింహనాదమేమిఁ । జేసి కేల
దండమొకటి ద్రిప్పి । తత్సారథినిఁ జంపె, దంష్ట్రిపురికి నప్పుడె క్షణంబ. ౨౦౯

— । అగ్నికోపుఁడు మూర్ఛిల్లుట । —

వ. అదియుం గని సింహవక్త్రుండు నిజభుజాదండ మండితంబగు దండంబునం బ
రాక్రమాధిపుండగు నగ్నికోపునిం జదిపిన నతండు మూర్ఛాగతుండై ప
డి నంత. ౨౧౦

తే. దానవేంద్రుఁడు మగుడ రథంబు నందు, వేరొకనిసూతుఁ నియమించి । విక్ర
మమున
భూతనాథుసుమాలినిఁ । బోరఁగదియ, నసురుపై నేసెఁ దఁడు మహానగంబు.

వ. అప్పుడ ప్పర్వతం బఖర్వగర్వధూర్వహుండగు నమ్మహాసురుండు బాలుం
డు కందుకంబు వోలెఁ గేలం గీలించి మగుడ సుమాలి వక్షంబునం బర
వఁ దత్పతనంబున నతండింతక నేపు మోహపరవశుండై పడియె నప్పుడు.

— । దండిమూర్ఛాగతుఁడగుట । —

ఆ. ఇట్లు వడిన నగని వీక్షించి దండియు, వజ్రకఠినమైన । వాసిరసురఘు
దండమునను మోదె । దద్ఘట్టనంబున, నదియు జూర్ణమయ్యె । నాక్షణంబ.

వ. మఱియుఁ గోపంబు గదుర భూతసేనావిభుండగు దండి తుండంబున మహా
సింహంబును జెండు వేదండంబు పోల్కి బ్రీతాపోద్దీపితుండగు నద్దైత్య
నాథుని శరంబునం జెండిన నమ్మహాదనుజుం డలిగి పాదంబునం దన్ని య
తని నేలం బడవైచి దాన నభోమండలంబు కెగయఁ జిమ్మెన. ౨౧౪

క. దివినుండి ద్రుమికి దివిజుఁడు, జవ మొప్పగ దైత్యు బాహు । శాఖలద్రోఁడ

ప్లవగవరేణ్యము వోలెను, వివిధగతిం గంతులిడియె వేమరు కరుణా.

తే. మఱియు లతలను ద్రిమ్మరు మధుపమాల్కల నసమమండలి జరియించు నతని వాన
వ్రంపు మతిఁ గనుపఱుచుఁ బోలెఁ గేలఁ, బట్టి వలువుచు దవ్వుగాఁ బారవైచె.

వ. ఇట్లు వైచిన భూతేశుండు మూర్ఛాగతుండయ్యె నంత. ౨౧౮

క. సేనాపతు లీవిధమున, దానవుచే విజితులైన తత్క్షణమందున్
భూనుత శౌర్యులు వీరులు, మానుగ జనుదెంచి సమరమండల మందున్.

ఆ. నిశితసాయకములు నిగుడింపదనుజుపై, నవియు బుష్పవృష్టియయ్యె నతని
కపుడు దైత్యనాథుఁ డరదంబుదిగి వేగ, సింహనాదమెలమిఁ జేసి కొనుచు.

క. కేసరి వోలె గజంబుల, భాసుర శౌర్యమునఁ గేల పరిపంథుల నెం
తే సమరమున నడఁచి కొని, చేసె శరస్వరహతులవిశీర్ణాంగులుగన్. ౨౨౦

వ. మఱియు రథంబుల తోడన గొందఱ వీరుల పాదఘాతంబుల నింగి కెగయఁ
దన్ని నిహతులం జేసె, నిట్లు బహుప్రకారంబుల వీరవరుల నేపణంచిన సం
గనుంగొని భూతంబులు భీతంబులగుచు పరిభూతంబులై మృగంబుల పగిది
దిగంతంబులకుఁ బాఱె నంతయు. ౨౨౧

— వీరబాహుఁడు సింహవక్త్రతనయులనూర్వురను దునుముట. —

శా. వీరాధ్యక్షుఁడు వీరబాహుఁ డదియున్ వీక్షించి కోపంబునన్
నారాచంబులు నారిఁ గూర్చి పరపెన్ నానారిపుశ్రేణిపైఁ
జోరన్ గ్రీష్మఘనాఘనంబు సలిలంబున్ నించు చందంబు దే
వారుల్ ధారుణిఁ గూలి గత్తరి సమస్తానీక సంయుక్తులై. ౨౨౨

క. భూరి కబంధంబు లస్రక్పూరముల వఱంచె మించె ఘోరపిశాచా
రావములు మఱి కంకము, లాహూతి పలాభిలాష మడర భ్రమించెన్.

వ. అదియుం గని సింహవదను తనూజులు నూర్వురమర్షంబున శరవర్షంబు
లు గురిసిన వీరబాహుం డలిగి సింహనాదం బొనర్చుచు ననేక సాయకంబు
లు వారలపైఁ బరపె నప్పుడు. ౨౨౪

ఆ. సింహవక్త్రసుతులు శితశరంబు లనేక, కోటిసంఖ్య లెలమిఁ గురిసి రాజి
తావదంశకములఁ దచ్ఛరంబులు విచ్ఛిన్నరదములను దునిమి తూల్చె
నతఁడు. ౨౨౫

వ. అంత దనుజ సేనలం గల బలుమగలు పలువురుం గూడికొని యతనితో డ ధనుర్యుద్ధంబు సేయ మనబలంబుల నెవ్వండు సాలండని యాలోచిం చి ఖడ్గఖేటకంబులు ధరించి మెరవళ్లం జూపుచు నుక్కుమీఱిన నవ్వీరాగ్రణిం జుట్టుకొని రయ్యెడ. ౨౨౬

మ. ఘనరోషంబున వీరబాహుఁడు మహోగ్రంబైన ఖడ్గంబు గొ బ్బున సంధించి రణాంగణంబునకు విస్ఫూర్జద్భుజాభీలురౌ రొక్కనరాగ్రణి గని సింహవక్త్రసుతులుం గోపంబు దీపించి యా తని ఖడ్గంబున నొంప జాలమి సముద్యద్భ్రాంతిం దామందఱుం. ౨౨౭

వ. అతని వధియింప బడి సంహరింపం దలంచు నంతలోన నవ్వీరబాహుండు నొ క్కబాణంబున నిశితకరవాలంబున నప్పాపాత్ములగు సింహాస్య తనయు ల నూర్వురం దునిమి వైచి శీఘ్రింబ పరమ మంగళంబగు రథం బధిరో హించిన నప్పుడు సురలు విరుల వాన గురిసి రెంతయు మోదంబున.

— వీరబాహుసింహవక్త్రుల యుద్ధము. —

ఉ. అంతట సింహవక్త్రుఁ డపు డారసి పుత్రవియోగశోక మ త్యంతము దుర్నివారమయి యక్కట వీఁడొకరుండు నిర్దయ స్వాంతత వీరి నందఱను సంహృతిఁ జేసె నటంచు నిగ్గుచే నెంతయు జింత నొందిమది నాపెసఁగంగ మహాగ్రహంబునన్.

వ. వైర్యర్థా సేయుండు గావున విక్రమంబు నెక్కొలుపుచు సకల భూతంబుల నిప్పుడు బలునితోడం గూడ క్రమ్మరగ నఖిల లోకంబు లణంచెద నట్లుకా ని నాకోపం బుపశాంతంబు గాదని తలపోసి రథారూఢుండై వీరబాహుం గవిసిన. ౨౩౦

ఆ. వీరబాహుండపుడు వేగంబ యెదిరించె, బాహుశౌర్యమెనఁగ బ్రధనమునకు నంత నతనిఁ జూచి యాత్మలో నత్యంత, దర్పమడరఁ బలికె దానవుండు.

క. ఏరా! యెవ్వఁడవీవుగు, మారుఁడవో లక్షవీర మండలికోన్ వీరుఁడవో గాకను నవ, వీరులలో వాఁడవో భువిన్ దూతవకో!. ౨౩౨

వ. సత్యంబుగా నాకెఱింగింపు మనవుడు. ౨౩౩

మ. వినుమా దానవదేవదేవుఁడు మహా ♦ వీరుండు నాకార్తికే
యునకున్ దాసుఁడ నాత్మభావమున ము ♦ న్నుద్యద్గతిన్ జచ్చి దై
త్యనికాయంబు గలంచు చేమెఱుఁగవే ♦ తా వీరబాహుండు సం
జ్ఞను నేనెవ్వఁడనైన నేమిపుడు పృ ♦ చ్ఛం జేయ నీకేటికిన్. ౨౩౪

వ. అని పలికిన వీరబాహునకు సింహవక్త్రుం డిట్లనియె. ౨౩౫

మ. కరముం దర్పులులైన దానవుల సం ♦ గ్రామక్షితిన్ గూల్చుటన్
వరశౌర్యంబగు నొక్కొ నీకు నరయన్ ♦ మత్పుత్రులన్ బాలురన్
ధరఁ ద్రెళ్ళించుట దొడ్డ పౌరుషమొకో నా ♦ దర్పింపఁగా నేల సం
గరమందున్ నిలు నిర్వధించి ముదముం ♦ గావింతుఁ గంకాళికిన్. ౨౩౬

వ. విను మింత మాత్రంబు గాదు నిన్నుం బరిమార్చి నెడనెడ సొచ్చెనేని భవన్నాథుండైన గుహుండు భూతసేనా సమేతుండై దేవగణంబులం గూడుకొని వీరవరులతోడ నరుదెంచెనేనియు సంగరాంగణంబునం బరిమార్చెదనని సాహంకారుండై పలుకు నతని వచనంబులు శ్రుతిపుటంబులకు నతికటువులగుట నించుకించుక విని మనంబునం గనలుచు నేత్రంబుల నుగ్రంబుగు కోపరసంబుం గ్రిక్కుచు నుక్కసంగ వీరబాహుండు నిశితంబులగు దశవిశిఖంబులు గైకొని సింహముఖుని కఠినంబగు యురంబునం జొనిపిన నవియు భగ్నంబులై పడియె నప్పుడు. ౨౩౭

క. దండము గొని దానవుఁడు, ద్దండత నవ్వీరుమీఁదఁ దద్దయు వేగన్
గాండంబుల నాల్గిటనది, ఖండించిసు రేంద్రుఁ డులుక ♦ గడలు కొనంగన్.

వ. మఱియు శరసహస్రంబు లసుర బృందంబునం జొనిపిననవియుం బొడియై నేలంబడియె నంత. ౨౩౮

క. దనుజపతి మఱియుశూలము, గొని భీకరపటిమ వైవ ♦ గొబ్బున నదియున్
దునుముటకు వీరవర్యుఁడు, ఘనదస్త్రసహస్రములును ♦ కడువడి గురిసెన్.

క. శూలంబది తత్సాయక, జాలము ఖండించి యెదుటఁ ♦ జయ్యన తా నా
భీలత వీరుఁడు మఱి శర, పాళి సహస్రంబు గురిసె ♦ పటిమ యొసంగన్.

వ. అదియును శరసహస్రంబుల బ్రతిహతంబు గావించి శూలంబు సత్వరంబుగా నవ్వీరుం గదిసిన నతండు సంభ్రముఁ డగుచుఁ గరవాలంబుం గొనిత

చ్ఛాలంబుఁ దునియలుఁ జేసి నవ్వుచు వేలుపులు నవ్వీరబాహు పరాక్రి
మంబు నగ్గింపుచు సంతసించి రంతయు. ౨౪౧

మ. మఱియుం గోపవిభీషణుండగుచు శుంభత్ప్రౌఢి నవ్వీరుఁ డ
త్తరి సంధించె మహోగ్రపాశుపతమున్ ♦ దైత్యేంద్రుఁ డాతండు నే
ర్పార తద్బాణముఁ గూని యేసె నపుడం ♦ తే యవ్వియున్ రెండు న
గ్గిరి యన్యోన్యహరణంబు చేసె మగుడన్ ♦ గౌరిగ్యంబులన్ వీడుచున్. ౨౪౩

వ. వీరబాహుం డద్దైత్యుపరాక్రమంబునకు మనంబున నాశ్చర్యంబు నొం
దుచు గుహుండు దక్క నాకితని జయింప నశక్యం బితని నేనల నేన సం
హరించెదనని కోపోజ్జ్వలితుండై మహాసాహసంబున. ౨౪౪

క. కదనంబునఁ దత్సూతుని, పదునాలుగు విశిఖములను బడవైచి భుజా
మదమున నడిగని దైత్యుఁడు, గదఁగొని కోపమున బర పెంకెను వీరుపయిన్.

వ. ఇట్లు వరపిన నదియు వీరవరుని శరీరంబున బడి సహస్రధా భంగంబు నొం
దెనంత నవ్వీరుండు శరసహస్రంబున నతని రథంబుఁ దునిమియార్చి పేర్చిన.

క. భూతంబులెల్ల శైల, వ్రాతంబులు వృక్షములు మఱి బహ్వస్త్రములు ప్ర
ఖ్యాతబలంబులు దనరఁగ, దైతేయ వరేణ్యు మీఁదఁ ♦ దద్దయు గురిసెన్.

వ. అంత సింహముఖుండు కోపోద్దీపితుండై వేరొక్క రథంబధిరోహించి ధను
స్సహస్రంబు గొని భయదంబుగ మౌర్వీనినదంబు సేయుచు బహుకోట్లశి
లీముఖంబులు కోలాహలంబు లొనర్పుచు భూత వ్రాతంబులపై వర్షించె
నంతయు. ౨౪౮

తే. తచ్ఛరాహతి మడిసి భూ ♦ తవ్రజంబు, శైలవిపినసరిద్ద్వీప ♦ సాగరముల
భానమండలదిజ్నభో ♦ భాగములను, బడియె నేరంధ్రముగ మహాప్రళయమట్లు.

వ. మఱియు జ్యోతిశ్చక్రంబును పాతాళంబును లోకాలోకంబును బ్రహ్మాం
డంబులు నిండె నయ్యవసరంబున జగత్త్రయంబునందు నతని బాణంబులఁ బ
డని ప్రదేశంబు లేదయ్యె నందు. ౨౫౦

తే. ధీరబాహుండు నతులితవిక్రమమున, నిశితపటుసాయకంబుల నేకములను
గురిసి దురమున నత్యుగ్రకోపమడర, తద్భటావళి నెల్లను ♦ ధరణిఁగూల్చె.

క. ఘంగదెంచు దైత్యసాయక, బృందం బరుదెంచు నధిక ♦ వేగంబుననద్రి

దంచునపుడువీరుఁడుశర, సంఘోహము పరపినదియు ♦ సారెకుఁదునిమెఁగా.

వ. ఇట్లు మహాసాహసంబు సూపు నవ్వీరబాహు ధనుర్విద్యాకౌశలంబు గని వియచ్చరు లచ్చెరువంది రెంతయు. ౨౧౩

ఆ. అంత సింహవక్త్రుఁడధిక రోషంబునఁ, బలికెవీరవరుని ♦ పరుష ఫణితి
శ్రుతి కటూక్తులొప్పనతఁడునుభఙ్గించె, దనుజ విభునిసరకుఁ ♦ గొనకమదిని.

వ. అంత నసుర వల్లభుండు సింహనాదం బొనర్పుచు దశసహస్ర విశిఖంబులు మహాఘోరంబుగా వీరబాహుపయిం గురిసిన నతండును దశలక్షశరంబుల నవి యన్నియుం దునుమాడి కోలాహలంబు లడర మఱియు బాణసహస్రంబులు సంధించి గ్రీష్మకాల ఘనాఘనంబుచందంబున నద్దురాత్ముపై వర్షించె నాసమయంబున. ౨౧౫

క. అడిగని నసుజుఁడు కోపము, గదురగ దశలక్షవిశిఖ ♦ కాండంబులచే
వ్రదళించి యవియు మఱియును, బ్రదరంబు లనేకకోట్లు ♦ పరపె నతనిపైఁ.

వ. అంత వీరపుంగవుండు తత్ప్రముక్తంబులగు సహస్రకోటి సంఖ్యాకంబులైన శిలీముఖంబు లాక్షణంబ దునిమివైచె నంత సంచలిత హృదయుండై దైత్యేంద్రుండు ద్విసహస్రశరములఁ వీరబాహుని దృఢతరంబగు చాపంబుఁదునిమె గోపంబున. ౨౧౭

క. వీరుండొండొక చాపము, ధీరతఁ గొన నంతలోనఁ ♦ దీక్ష్ణాంబకముల్
వారక ననేకకోటులు, ఘోరంబుగఁ బరపె దనుజ ♦ కుంజరుఁ డలుకన్.

వ. తద్బాణఘాతంబుల రక్తసిక్తాంగుఁడయ్యును బీరంబు సెడక వీరబాహుండు శరాసనంబునం గొనయం బెక్కించి దుర్వారంబుగా శతసహస్ర సంఖ్యాక నారాచంబులు నిశాచరుపయిం గురిసె నప్పుడు. ౨౧౯

క. అసురేంద్రుడు కోలాహల మెసఁగఁ దదస్త్రములురోష ♦ భీషణుఁడగుచున్
వెసఁ దునిమి లక్షశరముల, దెసలదరఁగమఱియుఁ బరపెఁ ♦ దీవ్రశరంబుల్.

వ. అంత మహాబలుండగు వీరబాహుం డవి యన్నియు ఖండించిశస్త్ర సహస్రంబుల నత్యున్నతంబును నతిసుందరంబును నగు నతని యరథంబు భగ్నంబు చేసిన. ౨౨౧

శా. అంతన్ వేఱొక తేరు నెక్కి కొని సింహాస్యుండు భూభాగ
మత్యంతంబుగ జలియింప వేగముగ నా ♦ దైత్య పార్థివున్ దోలెదు

ర్దాంతస్ఫీముఁడు వీరబాహుఁ డురుశస్త్రశ్రేణి ఖండించె సా
శ్రాంతంబుల్ వణకన్ శరాసన సహస్రంబున్ దదీయుం బాగన్. ౨౬౨

వ. అప్పుడు సకలభూతంబులు గుహూహాలన మేతంబులై కోలాహలంబు లొన
ర్చె నంతయు. ౨౬౩

మ. అది వీక్షించి దురాత్ముఁ డద్దనుజుఁ డత్యంతోగ్రుఁడై భూతలం
బదరన్ భ్రూకుటిపెట్టి ఘోరమగు మాయాపాశమున్ బూని య
య్యదమాటన్ రిపుకోటి నెల్ల పతనం బొందింప మంత్రించి యే
పొదవన్ దక్షిణమందవైచె సమర ప్రౌఢ్యమ్మహాశౌర్యుఁడై. ౨౬౪

వ. అదియు నత్యంత ఘోరంబును నతిగాఢతమోవృతంబును ననవఘ్నకారంబు
ను నతులవేగంబును నఖిలరిపుభయంకరంబును నగుచుఁ జరుదెంచె దేవ
దూతలు విలోకించు నంతలోన నవ్వీరబాహుప్రముఖులగు సకల సేనాప
తుల బంధించి పూర్వాచలంబునం బడందోసె నంతయు. ౨౬౫

—॰ సింహవక్త్రుఁడు కుమారస్వామిపై యుద్ధమునకు వెడలుట. ॰—

తే. అంతసింహాస్యుఁడత్యంత హర్ష మొదవ, నతులకోలాహలధ్వను లమరఁజేసె
ఘండనక్షోణి వెడలి యుగ్భటుఁడు గుహుఁడ, తండెచటనుండుననుచు దూత
లను నడిగె.

వ. అప్పుడు దూతలిట్లనిరి. ౨౬౬

మ. అనఘుపౌత్రియు హేమకూటనగరంబు బాదున్ షడాస్యుండు పా
వనచర్యుండు మహాబలాఢ్యుఁడిపు డున్ వర్తించు సాహసి వా
హినులున్ భూతగణంబు గొల్వ ననుమున్ హీనాత్ముఁడై దైత్యుఁడున్
విని వాసన్ బరిమార్చి వత్తునరుచున్ నేఁబోయె నవ్వీటికిన్. ౨౬౭

వ. అయ్యవసరంబున నిఖిలదనుజబలంబు లతని వెంబడించెనిమ్మె నదియుం గ
ని పవనుండు శరవణోద్భవున కిట్లనియె. ౨౬౮

ఆ. వీరబాహుప్రముఖ వీరులందరు నేడు, భండనమున బాహుపటిమ దొలఁగి
ప్రాగ్నగంబునందుఁ బడిరి మాయాపాశ, బద్ధులగుచు నింకఁ బలుకు లేమి.

క. దానవవిభుండె నీపై, సేనాన్వితుఁడగుచు వచ్చె శీఘ్రమ యనుమున్
సేనాని యతని వచనము, వీనుల విని చటుల రోషవిస్ఫురణ మెయిన్.

— కుమారస్వామి యుద్ధసన్నద్ధుఁ డగుట. —

వ. అప్పుడు సింహాసనంబు డిగ్గి దానవుం డెందున్నవాఁడని యుద్ధసన్నద్ధుండ
గుచు బ్రహ్మభవార్పితంబులైన మణిపాదుకలు మెట్టి కక్ష్యాంతరంబులుం
గడచి నిజమందిరద్వార పురోభాగంబున సమీరప్రేరితంబగు మహోన్నత
స్యందనం బధిరోహించి. ౨౭౨

సీ. విధికైటభారులు • వీరులు సేసలుఁ జల్ల, సురరాజు ధవళచా • మరము వీవఁ
జంచాద్రిక్కులిసువంక • ఛత్రముల్ ధరియింప, ననలుండు కరదీపి • కను వహింప
దండిఖడ్గముఁ బట్టి • దండను జెలువొంద, నసురవల్లభుఁడు కా • హళము నూద
వరుణుండు కాళాచి • వల నెప్పుఁ బూనంగ, ధనదుండు పీటికా • ధరుఁడు గాఁగ
తే. శూలమీశానుఁడు ధరించి • మోరిలనవు వ్యనమరులాగినఖిలోపచా • రము
లొనర్ప
భాసురంబుగ దివ్యమై • భవము దోప, వెడలె సేనాని శాత్రవ • విజయయాత్ర.

మ. చెలఁగెన్ వాద్యరవంబు లెల్లెడల భా • సిల్లెన్ ధ్వజౌఘంబులున్
వెలసెన్ మౌనిగణంబు సంస్తవములన్ • విద్యాధరుల్ బాడిర
త్యలఘుప్రౌఢిమ వందిసంక్తి నిజశౌ • ర్యౌదార్యగాంభీర్య కౌ
శలముల్ వీనులవింపుగాఁ బొగడెను • త్స్నేహంబు చూపట్టఁగన్. ౨౭౫

తే. నారదాదులు వేడ్కఁగా • నములొనర్చ, యలర ధ్వజములు కట్టిరి • యక్షవరులు
భూతజాలంబు లాయుధ • ములను గేల, గ్రిప్పు చెల్లెడ వచ్చిరి • దన్మూర్తి మెఱయ

వ. అంత. ౨౭౬

మ. అదె వచ్చెన్ రిపురాణ్మదద్విపఘటా • దర్పగర్వ సర్వాంకషో
న్మదకంఠీరవ మద్రిరాట్ దుహితృశుం • భచ్ఛుక్తి ముక్తాఫలం
బదె యేతెంచె నటంచు నింగిని సుప • ర్వాసీకముం జూచి సం
మదమున్ మీరఁగఁ బుష్పవృష్టి గురిసెన్ • బ్రహ్మాదు లద్దేవుపై. ౨౭౭

వ. ఇవ్విధంబున సకల జగజ్జేగీయమానుండును సకలేశ్వరుండును నశేషభువ
నసృష్టిస్థితిసంహారకారకుండును ననంతకల్యాణగుణాభిరాముండును ననవధిక
సంపత్కరుండును సమరబృంద సంరక్షకుండును నసురకులశిక్షకుండును న
ణిమాద్యైశ్వర్యోపేతుఁడును సకల స్వతంత్రుండును నసహమశస్త్రాయుధ

పరిశస్త్రహస్తుండును నదిరికోదండసమానుండును నంబికాసూనుండు నగు
నక్కుమారుండు మహాబలులగు వీరులతోడ నతివైభవధురంధరుండై పట
హాదివాద్యరవంబుల నధఃకరించి మనోహరంబు లగుచు జగత్త్రయంబు నిం
డిన సకలజన కలకలధ్వనులువినుచు సంగ్రామరంగంబుసేరెనప్పుడు. ౨౮౮

క. హరిచతురాస్యపురోగమ, సురలా దూరమున నునిచి ♦ సుబ్రహ్మణ్యుం
డురు శౌర్యనిధులు వీరులు, పరిసరమునఁ గొలువ నొక్కపజ్జ వసించెన్.

వ. అయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై మహీరుహ
శిలాధరోపలంబులుఁగురియుచు నసురసైనికులతోడ దరంబానర్చి రెంతయు.

తే. దనుజులవ్వేళ భూతసంతతుల చేత, భంగమొందిరి సంగర ♦ రంగమందు
నదియుఁ గనుఁగొని సింహాస్యుఁ ♦ డాగ్రహమున, ఘోర విగ్రహుఁడగుచు
ను ♦ భూరిమహిమ. ౨౮౧

క. అని వరశెంచెడివానిం, గనుఁగొని భూతంబు లెల్ల ♦ కడురోషమునన్
ఘనశైల భూజశిలలుఁ, గొని దానవుమీఁదఁబరపె ♦ గూడియొకమొగిన్.

— సింహవక్త్రుఁడు భూతముల గబళించుట. —

మ. అసదృక్ప్రౌఢిమ భూతసంఘముల సింహాస్యుండు రోషంబునన్
ద్విసహస్రోజ్జ్వల బాహుదండముల నొంతే దట్టి యొక్కుమ్మడిన్
వెస నించెన్ వదనంబులుం దెరచి యాభీలంబుగాఁ గుక్షిలో
దెసలన్ ఘూర్ణిల హుంకృతిస్ఫూర్జటులు నుద్వేలంబు గావింపుచున్.

వ. అయ్యవసరంబున భూతంబులు బలపరాక్రమోపేతంబులై తదీయ నాసా
పుటంబులను గర్ణరంధ్రంబుల వలననుం గొన్ని భూతంబులుం వెడలి ది
గంతంబులకుఁ బరచెఁ గొన్ని వెలుపడ నలవిగాక నుదరంబునన యుండెఁ
గొన్ని మహాసాహసంబున నిజాయుధంబుల నతని యుదరంబు భేదింపం
బూని యుండె నిట్లు దురితాత్ముండగు నద్దానవుండు సహస్రవాహినీ సం
ఖ్యాతంబులగు భూతంబులం గబళించి మఱియు వీరులను సేనా పతులను
గ్రమంబున గ్రసించె నప్పుడు గుహుండు డాకరుండ నిలిచి తత్సమస్తం
బాశ్చర్యంబుగా వీక్షింపుచుండె నట్టియెడ. ౨౮౪

క. అవ్వృత్తాంతము దెలియుచు, వేవేజని దూతలుపుడు ♦ విబుధౌఘమఁసీ
దావానలనిభ శౌర్యవి, భావసుఁడగు వీరుఁ త్రోడ ♦ బలికెరి వరుసన్.

క. నీయనుజన్ముఁడు స్థిరని, కాయంబును వీరభావముఁ ఘనబల పటిమా
సూయాపాశ నిబద్ధులఁ, జేయుచు భూతములమిగిలింగె జితరిపువీరా!. ౪౮౬

వ. అనిన విని శూరపద్మం డత్యంత సంతోష భరితాంగుఁడగుచు సద్దూతల
కు దివ్యభూషణాంబరంబులు బహుమతి నొసంగి సహోదరుని కడ కనే
కదానవ్రులం బనిచి తానును సింహాసనంబు డిగ్గి సకల శత్రుభీతుకుండ
గు నిజానుజుం గనుంగొనుచు నుత్సాహంబున సముత్తుంగంబగు గోపురశృం
గం బెక్కి రణాంగణంబున నొంటి నిలిచియున్న గుహునిఁ జూచుచుభీష
రూపుండును మహాకాయుండును నగు సింహవక్త్రునిం జూచి యెడ లెగని
ప్రమోదంబున వారలపోరుఁజూచువాఁడై యందు వసించె నని సూతుం
డు శౌనకాదులకుం దెలిపె నంతయు. ౪౮౭

ఆశ్వాసాంతము.

శా. క్రీడాశంబర బాణహస్త ప్రణమ ♦ ద్గీర్వాణ మౌళిప్రభా
భాస్వితంఘ్రిద్వయ యోగిపుంగవ మనః ♦ పద్మస్ఫురద్భంభరా!
క్ష్వేడాహార వినోదమోదిత జగ ♦ త్కీర్త్యప్రభావోదయా!
చూడాకల్పిత చంద్రభూషణజటా ♦ జూటస్ఫురద్యోధునీ. ౪౮౮

క. లింగత్మాపాలక తన, యాంగణ సురభూజ! శైల ♦ జాలింగన హా
రాంగదనలమాకార భు, జంగ! యనంగావలేప ♦ సంతమసరవి!. ౪౮౯

మయూరవృత్తం

కంజభవసేవ్యపద ♦ కంజయుగ! లీలా, రంజితనమజ్జన! ని♦ రంజన విలాసా!
మంజులదరస్మితస♦ మంజసముఖాబ్జా!, కుంజరమదాపహర♦కుంజరముఖాంకా!.

గద్యం.

ఇది శ్రీ మత్సకల సుకవిజనానుగ్రహపాత్ర కాశ్యపస గోత్ర
కోడూరి యల్లనార్యపౌత్ర శంకరామాత్యపుత్ర లక్ష్మాంబికా
తనయ వినయవిధేయ బాలసరస్వతీ నామాంక వేంక
టాచలకవి ప్రణీతంబైన స్కాందంబను మహాపు
రాణంబున శంకర సహితమను శివరహస్య
ఖండంబున యుద్ధకాండంబునందు
తృతీయాశ్వాసము.

# శ్రీ స్కాందమహాపురాణము.

## యుద్ధకాండము - చతుర్థాశ్వాసము.





భైరకూటలింగా!
త్ర్యంబురిపుతనయాసేవ్య ♦ చరణాబ్జ! భవా
నీబంధుర పరిరంభ
శ్రీబహుకుతుకాంతరంగ! శ్రీశివలింగా!

వ. అవధరింపుము శౌనకాదిమహామునులకు సూతుండిట్లనియె. ౧

తే. రాక్షసేంద్రుండు గోపురా♦గ్రముననిట్టు,లుండ శీఘ్రంబ సేనాని♦ యుద్ధమునకు
వెడలె సింహాస్యు నెదిరించి♦ విక్రమమున,సింధురము మీఁదఁ బరలెంచు♦సిం
హమట్లు. ౩

వ. అయ్యవసరంబున దనుజసైన్యంబు పెడబొబ్బలిడుచు గుహునిం జుట్టుకొని
యె నంతయు. ౪

మ. అసదృక్ప్రాభవ్యుఁడు కార్తికేయుఁ డపుడు ♦ ద్యల్లీల నద్దైత్యసై
నసమూహంబులఁ జూచి మశక♦ప్రాయంబుగా నెంచుచున్
వెస సుప్తోరగమట్ల చెన్నొనఁగు మౌ♦ర్వీన్ వింట సంధించి యే
పెసఁగన్ జేసె రవం బజాండమొగి భే♦దిల్లన్మహోగ్రంబుగాన్. ౫

వ. అప్పుడమ్మహారవంబు విని దానవేంద్రుతురంగంబు లధోముఖంబులై సే
లం గూలె నిట్లగుటం గనుంగొని సింహముఖుండు మనంబునఁ దారక సం
హారకుం డితండని నిశ్చయించి యమ్మహాబలుండు గుహుని సమీపంబున
కుం జని యతనిం గని యిట్లనియె. ౬

క. భవదాగమనం బేటికిఁ, బవరంబునఁ దుంతుమేమహఁ♦ బ్రతిరోధి తతిన్
ధృవముగ దీనఁ గొదువ నీ, కవునే నీనచ్చుహాగ్రివ ♦ సరుగుము బాలా! ౭

వ. అనిన నతని వచనంబులు విని దేవసేనా విభుండు మొగంబునం జిరునగవు లొలుక వాని కిట్లనియె. ౮

—◆ కుమారస్వామి, మిమ్ము సంహరించుట కరుదెంచితినని పెచించుట ◆—

క. దుష్టజనుల శిక్షించుట, శిష్టుల రక్షించుటయును ◆ క్షితిమండలిమా కిష్టంబెంతయుఁ గానఁబ్రి, హృష్టాత్మత నరుగుదెంచి ◆ తేనిటు చటికిన్.

క. పాపాత్ములైన మీచే, నాపన్నతఁగాంచె మిగుల ◆ నమరగణంబో పాపపలుమాటలికేటికి, నేపణఁపన్ మిమ్ము వచ్చి ◆ తిచ్చటికిలమిన్. ౧౦

వ. అనిన సింహవక్త్రుం డిట్లనియె. ౧౧

—◆ సింహవక్త్రుండు కుమారస్వామితో వీరంబులు పలుకుట ◆—

క. వీరన్ సర్వసుపర్వా, నీకము విడిపింపనిపుడు ◆ నీచే నగునే మాకు బలరహితమగుచో, నీకామితమున్ ఘటించు ◆ నిక్కం బజియన్.

వ. ఇంక బహూక్తు లేటికి? భవజ్జనకుండేనియు సమరంబున మమ్ము జయింప సమర్థుండు గాఁడు నీవు బాలుండవు సంగరకళాకౌశలంబుఁ జాలమిం జేసినా ద్భుజపరాక్రమంబు సహింపంజాల వట్లుగావున నాదు వచనంబు విని శీఘ్రంబ నందేని పలాయనంబ నొందు మింతక మున్న భవదీయులగు వీర బాహుప్రభృతుల నుదయాచలంబున మాయాపాశ బద్ధులం గావించుట యుఁ దక్కిన భూతగణంబుల గ్రహించుటయు నిఖిల సురలను నారాగృహంబునం గాసింబెట్టుటయు నీవెఱుంగవే? ఒక్కండ విప్పు డవశిష్టుండనై యున్నవాఁడవు. తాదృశంబులగు శౌర్యధైర్యంబులుం గలవాఁడ నన్నున ర్భకుండగు తారకుని విధంబునంజలపకుము మనంబున. ౧౩

క. కొందఱు దురమునహతులై, పొందిరియమసదనమిపుడు ◆ పోయిరి దెసలన్ గొందఱసంఖ్యాతంబుగ, నిందుండియు నీవెఱుంగ ◆ వే? నాబలమున్.

క. బందీకృతమగునిర్జర, బృందము గలనైన విడుతు ◆ నేఁటిఁక మీఁదన్ స్కందా! భవచ్ఛౌర్యమునా, ముందరవిడుచుంక సమ ◆ మున నిన్నణఁతున్.

—◆ కుమారస్వామి సింహవక్త్రుని వక్షస్థలము నుండి భూతములను వెడలించుట ◆—

వ. అని యివ్విధంబున దురాలాపంబులాడు నద్దురాత్ముని గని భగవంతుం డగు బాహులేయుండు దంతపఙ్క్తి చంద్రికలు సాంద్రంబుగా వెలుంగద

రహాసుందర వదనారవిందుండై యొక్క నిశిత విశిఖంబున నతని వక్షం
బున గాడనేసిన రుధిరంబుతోడ నారంధ్రంబు వలనుండి కొన్ని భూతంబు
లు వెడలి సత్వరంబుగా దిగంతంబులకుం బరచె నప్పుడు. ౧౬.

క. వనుజుండు రుధిరరంధ్రము, దనకరమున మూసి యుదరతలమున వెసం వ
క్కన భూతంబుల నస్త్రం, బున మొనరం బ్రచండపటుకోపమునన్. ౧౭

మ. అతిభీమంబగు దండముం గొని సువక్షస్థలాత శైలేంద్రజా
సుతుపై వేసిన నమ్మహాబలుడు విస్ఫూర్జత్ ప్రతాపంబునన్
జతురస్త్రంబులు నూరిరమల్ పరపి దండచ్ఛతింబు లాదండ ము
ద్ధతి ఖండించి తదీయఫాలమున నత్యంతంబు నారాచ మేసన్. ౧౮

ఆ. దానజలమొకింతదక్కదైంత్యేద్రుడు, జఠరబిలముగప్పదోయుము విడిచి
వ్యాఘ్రహృదయుడయ్యెనఖిలభూతంబులు, వేగరంధ్రముపునవెడలిచనియె

—: కుమారస్వామి భూతముల బ్రతికించుట :—

వ. తదనంతరంబ యంతకమున్న సింహవక్త్రాది నిశాచరులచేత నిహతంబు
లైన భూతసైన్యంబులు కుమారకృపా కటాక్షంబున సంజాత చైతన్యులై
లేచి యెల్లెడలవెల్లి విరిసె నప్పుడు. ౨౦

—: కుమారస్వామి వీరబాహ్వాది వీరులం బిలిపించుట :—

ఆ. వీరబాహుముఖ్యవీరులనందఱ, దోడి తేరగరుణ తోడనపుడు
పాశమోచకమగు బాణంబుబరపెను, బార్వతీసుతుండు పటిమ మెఱయ.

వ. అట్లయుం జని యుదయాచలంబున మోహితాత్ములగు యోధుల సముత్ప
న్నబోధులం జేసి మాయాపాశంబు నాశంబు బొందించి యాక్షణంబ వా
రల నెల్లపుష్పకంబు వోలె వహించుకొని సుఖంబునం దోడితెచ్చి గుహుం
గానుపించి తదీయానుమతి వడసి నబ్బాణంబు తూణంబు ప్రవేశించె
నంత. ౨౨

—: వీరబాహ్వాది వీరులు కుమారస్వామిని స్తుతించుట :—

తే. వీరబాహుండు మొదలైన వీరవరులు, పార్వతీనందనుని పాదపద్మములకు
భక్తిబ్రణమిల్లి సంస్తుతుల్ పరగ జేసి, రార్తులను మమ్ము రక్షించి తను
చు మిగుల. ౨౩

క. దనుజేశు పాపాత్ముఁడు మిమ్ము మాయాపాశబంధమున గాసిలఁ జే
సెనకటా యని గుహుఁ డెంతయు, ననుపమకృప వీరవరుల నాదృతిఁ జేసెన్.

వ. వెండియు స్కందునకు వారలిట్లనిరి. ౨౫

క. ఏమొక ప్రియమున మెఱుఁగము, స్వామీ! నీకరుణ చేత సర్వాపదలన్
వేమాఱు దొలఁగె సకల, క్షేమాభ్యుదయంబు మాకు సిద్ధించెఁ గదన్.

— కుమారస్వామి రాక్షససేనలఁ బరిమార్చుట —

వ. అనిన స్కందుం డానందభరితుండై మౌర్వీనాదంబుఁ జేసియభేద్యంబగు
నమ్మహాధ్వని విని సకల దానవులు మూర్ఛిల్లి తోడఁ దెలిసి కడిమి మెఱయఁ
బెడబొబ్బ లిడుచు గొబ్బున దేవసేనానిపై నుగ్రశరవర్షంబులం గురి
యుచుం జుట్టి రెంతయు. ౨౭

క. శరవణసంభవుఁ డంతను, స్ఫురితామర్షమున దైత్యపుంజము మీఁదన్
శరవర్షంబులు నించెను, నిరుపమబాహుప్రతాపనిపుణత మెఱయన్. ౨౮

వ. అప్పు డయ్యమోఘకీలీముఖంబు లతితీవ్రదండఖడ్గనిశక్తి పరశుశూలా
ద్యాయుధ సముత్పాదకంబులును నాగమధర్మ సంస్థాపకంబులును నసుర
సంహారకంబులును ననిలమనోవేగంబులును నబ్ధిశోషకంబులును నంబుధర
విదారకంబులును నర్కరథవిభేదకంబులును నపాస్తబడబానలంబులును న
జాండమేరుస్ఫోటనకరంబులును నతిభయదరావంబులును నగుచు దాన
వ్రల శిరంబులు కరంబులు నేత్రంబులు గాత్రంబులుఁ జెక్కలుఁ జెక్క
లుఁ జక్కాడి మదావళంబుల మదంబణంచి రథంబులు శిథిలంబులుఁ జేసి
తురంగంబుల భంగంబులొనర్చి బ్రహ్మాండాంతరాళంబుల నెరపుచు నం
తపార్థివంబగు కమలజాండంబు భేదించి రక్తశోణితపంకిలం బగునాశరవణో
దకంబులు సొచ్చుచు నితరాజాండంబులం బ్రవేశించి దేవబుధజనరక్ష
నందలి రక్కసుల నందఱ నుక్కడంచె నొక్కనిమిషంబున. ౨౯

మ. ఇల నాశ్చర్యము కార్తికేయుమహిమం బెన్నంగ సంగ్రామభూ
స్థలి నాతం డొకబాణముం దొడుగఁ దచ్ఛస్త్రంబు వహ్నో వేలు ల
క్షలు గోట్ల్యర్బుదపద్మశంఖము లసంఖ్యాతంబులై మార్గమం
దలరన్ బద్మభవాండముల్ నెరపి దైత్యశ్రేణిఁ గూల్చెం గదా. ౩౦

— హరిబ్రహ్మాదిదేవతలు దురాత్ములగు రాక్షసుల బారినుండి సంరక్షింపవేడుట —

వ. అప్పుడు హరిబ్రహ్మాదిసకలదేవతలు కంపితశరీరులునునున్మీలితనయనులు లగు చుం గృతాంజలులై దేవా! ఈదురాత్ములగు దానవులం బరిమార్పుము. కృపాకటాక్షంబున భవద్భక్తులమగు మమ్ము సంరక్షింపుమని పరమ మంగళుండును నచింత్యమహిమాధారుండును నక్షుద్రదివ్యవైభవుండును నగు కార్తికేయుని సంస్తుతించి రంతయు. ౩౧

మ. క్షణమాత్రంబున నిట్లు దైత్యులు గుహాస్త్రవ్రాత భిన్నాంగులై
రణభూమిం బడినం గబంధములు ఘోరస్ఫూర్తి నర్తించె తో
షణముం గాంచెను మాంసలాభమున ధ్వాంక్షశ్యేనకంకాలి భీ
షణతన్ మ్రోసెఁ బిశాచకాకలకలస్వానంబు లెంతేనియున్. ౩౨

క. శరవిద్ధుండై పూర్వము, పరితాపము నొంది మోహపరవశుఁ డగు న
ద్దురితాత్ముఁడు సింహాస్యుఁడు, పరగన్ గతమోహుఁ డగుచుఁ బ్రౌఢిమ
నప్పుడున్. ౩౩

— కుమార సింహవక్త్రులయుద్ధము. —

తే. సమరమండలిఁ ద్రెళ్ళిన స్వభటకోటిఁ, భూరిదోఃప్రౌఢిఁ గూలిన భూతతతిని
విక్రమాఢ్యతఁ జెలువొందు వీరవరులఁ, గాంచి మదిలోన రోషంబు గడలు
కొనఁగ. ౩౪

మ. దనుజేంద్రుండు సహస్రకార్ముకములన్ దృఢప్రౌఢిమన్ బూని చ
య్యన నేసెన్ దశలక్షబాణములు దేవాధ్యక్షుపై నాతఁడున్
ఘనరోషాప్తి సహస్రసాయకములన్ ఖండించి తచ్ఛస్త్రముల్
సొనిపెన్ దైత్యుని మేనుగాడ మఱియున్ స్ఫూర్జచ్ఛర వ్రాతముల్. ౩౫

క. మఱియును. ౩౬

క. పిశితాశియుఁ గోపంబున, దశలక్షలు పరపి శస్త్రతతులన్ గుహుఁడున్
భృశకోపవీక్షితాప, ద్విశిఖంబులఁ దునిమివైచె వెసఁ దచ్ఛరముల్. ౩౭

వ. అంత సింహాస్యుండు కోపావేశంబున సహస్రసాయకంబులు గుహుని సారథియురంబున నాటించిన నతండు పుష్పిత పలాశంబు వోలె రుధిర ధారారుణితాంగుఁడయ్యె నయ్యెడ. ౩౮

క. అడఁగని షణ్ముఖుఁ డలుకన్, బ్రిదరశతం బుగ్రముగను ♦ బరపిరణోర్విన్
విదళితము చేసిదైత్యున, రదముఞ్ శౌర్యప్రభాధు♦రంధరుఁ డగుచున్.

వ. అంత సంచలిత హృదయుండై నిలింపవైరి శరకుటంపగములు ఘర్మకాల
పయోధరంబు వోలెఁ దారకారిపై వర్షించె నప్పుడు. ౪౦

క. గుహుఁ డవియన్నియు నడుమన, బహుశరములఁద్రుంచి మఱియుఁ♦బ్రిదర
సహస్రిం
బహితునిపైఁ బరపిధను, స్సహస్రమును దునిమెనొక్క♦సారె నిహాళిన్.

ఆ. దళితచాపుఁడగుచు ♦ దానవుఁడంతట,శూలముగ్రతరము♦ గేలఁ బూని
కోపమడర రచిత♦కోలాహలుండయి, విడిచెదివ్యసైన్య♦విభునిమీఁద. ౪౨

వ. అరుదెంచిన దానిం జూచి. ౪౩

క. ఫాలాక్షతనూజుఁడుపడు, నాలుగు బాణములు పరపి ♦ నడుమనఁ దునిమెన్
శూలముఁబటుతరకోపా,భీలుండై సకలదిశలు ♦ భీతిఁజరింపన్. ౪౪

వ. మఱియు దేవసేనావిభుండు నసురవిభునిపై శరసహస్రంబులు గురిసిన న
ద్దనుజాధముండు దండంబున వారించి కృత కోలాహలుండగుచు హాలాహ
ల కంఠుతనయునిపయిం జనుదెంచె. నంతయు. ౪౫

క. చనుదెంచు దనుజుఁగనుఁగొని, ఘనశౌద్రివినిద్రుఁడగుచు♦గౌరీసుతుఁడున్.
సునిశితశరముల నేడిటఁ, గ్రునిమెన్ దత్కరము చటుల♦దోర్బలమొప్పన్.

వ. మగుడ యుత్పన్నంబగు కరంబున దండంబు గొని దానవుండు కోపంబున
దేవల్లభునిపైఁ బరపిన సురేశ్వరుండునది సహస్రశరంబుల ఛేదించెనప్పుడు.

క. ఛేదితమయ్యెన్ మఱియును, ఘోరంబగు పాశమసుర ♦ కుంజరుచేతన్
వారకనదియుం దునిమెఁగు, మారుఁడుపటిమన్ సహస్ర♦మార్గణముల చేన్.

క. దెసలన్ నిండను ఘోషము, లసదృశముగఁ జేసికొనుచు ♦ నసురవిభుండున్
ద్విసహస్రకరంబులతో, వెసవచ్చెన్ దివిజసైన్య♦విభుఁబట్టుకొనన్. ౪౮

వ. ఇట్లు కరంబులు సాచికొని జనుదెంచు నద్దనుజుం గని గుహుండు కోపం
బుగదురఁ జచ్చుపిడుగుల వోని రెండుపేలశరంబులుం దొడిగి సింహవక్త్రు
ద్విసహస్రకరంబులుం దునిమి పుడమిం బడవైచిన నవియు మహీరుహం
బులు వోలె మగుడ సముద్భూతంబులయ్యె దానవునకప్పుడు. ౫౦

క. ఛిన్నములగు కరములును, త్పన్నకరంబులను గొనుచు ♦ దనుజుండంతన్

మిన్నదర నార్చి పటుగ, రోన్నతి గుహుపై నెదిర్చెనసురుకోపమునన్
వ. ఇట్లెదిర్చినం గని. ౯౨
మ. అసదృశాశ్చర్యుఁడు బాహులేయుఁ డపుడు దృఢ్బాణ సాహస్రి మఁల్
వెస సంధించి తదీయశీర్షకములు నుర్వింగూల్చి ఖండించి పో
ల్లసదుత్సాహధురంధరుండగుచు లీలం ద్రుంచి ఘోరంబు లౌ
ద్విసహస్రప్రదరంబులుల్ బరపెనం తేతద్భుజా మండలిన్. ౯౩
వ. అప్పుడు మూర్ధంబులు భుజావళిజంబులు తోడన పునరుద్భూతంబులై పూ
ర్వంబట్ల పూర్వగీర్వాణునకుఁ జెలువొందినం గనుంగొని సర్వసుపర్వ ల
త్యంతాశ్చర్య నిమగ్నులై భయవ్యాకుల మానసులగుచు దవ్వులం బారి
రయ్యవసరంబున సుబ్రహ్మణ్యుం డాత్మగతంబున. ౯౪
క. వటభూరుహనికటంబునఁ, గుటిలాత్ములు దనుజవరులు ఘోరంబుగ ముం
ఘుటియించిరి వీరాధ్వర, మటుగావున నతని కిప్పు డాహవమందున్. ౯౫
వ. దళితంబులైన పాణిశీర్షంబులు పునరుద్భూతంబులయ్యె నని తలంచు
చుండ నప్పుడు. ౯౬
క. అసురుఁడు పలికెను గుహుతో, నసదృశమగు భూరిబలము నైశ్వర్యంబిం
పెసఁగ జరామరణాది, వ్యసన విదూరతయు మాకునలవడుజగతిన్. ౯౭
వ. అది గావున ఛిన్నంబులైన శిరః పాణులు మగుడ తినకుం జనియించె.
అస్మద్బలంబు నీవెఱుంగ నోపుదువే! కారాగృహాబద్ధులగు సుపర్వుల నింక
స్వప్నంబున నైన విడువనేర్తునే! బాలుండ వగుటం జేసి నిన్ను మన్నించె
ద నెంతేనియు శీఘ్రంబ యథేచ్ఛం జనుమనవుడు నతని వచనంబులువిని
కోపంబుగదుర దివిజసేనా వల్లభుం డిట్లనియె. ౯౮
ఆ. ఓదురాత్మ! రజ్జులోగిబల్కు టుచితంబె, నిలువుమాజినింక నిమిషమాత్రి
మపరియత్నమునరుణగింతుసేఁ కొవ్వు, నయ్యాయిదియథార్థమసురవినుము
వ. అని శంభుసూనుండు గంభీరంబుగాఁ బల్కిన విని దనుజసింహుండు కోపో
జ్జృంభితుండై సమరసంరంభం బెసంగ సింహనాదంబు సేసి ద్విసహస్రి క
రంబులఁ దావత్సంఖ్యంబులగు పర్వతంబులు పెకలించుకొని సుపర్వసేనా
నిచయింబరపిన. ౧౦౦
క. శరజన్ముఁడు తద్గిరులన్, శరశతమునఁదుముదుచేసి చయ్యన మఱియున్

స్ఫురదస్త్రసహస్రింబులు, సుపుతరముగఁ బరపె దైత్యుఁ డురముం గాడన్.

క. దితిసుతుఁ డురుధింధారా, ప్లుతవక్షుండయ్యు నగములును మఱియు మదో
ద్ధతిపెకలించుటయుం గని, యతనిశిరము లెల్లఁ దునిమె హరసుతుఁ డలుకన్.

వ. తచ్ఛిరంబులు పూర్వప్రకారంబున మొలుపుసూపెనంత నద్దానవేంద్రుఁ
డు బలపరాక్రమసాంద్రుండగుచు నార్పులు నిగుడ మగుడి తద్గిరులు గిరి
జా కుమారుపై వైచిన. ౬౩

క. నగజాసుతుఁ డయ్యున్నత, నగములు ద్విసహస్రసంఖ్య నారాచములన్
దెగటార్చి యొగిసహస్ర, శుగముల ఖడించె మఱియు సురరిపుభుజముల్.

ఆ. మగుడ నవియుఁ దొంటి పగిదిజనించిన, నవియుఁ దునిమె గిరుక హరసుతుండు
మాటిమాటికసుర మస్తకబాహువుల్ పొడమ పారెసారె గోడపెసవియు.

వ. ఇట్లుత్తర సహస్రవారంబులు దునిమి వైచిన నమ్మహా భుజభుజశీర్షప్రజం
బులు సకల దిశలను బాతాళంబును భూనభోంతరాళంబును బర్వతసము
ద్రంబులును నీరంధ్రింబుగా నిండె నప్పుడఖిలనిలింపులు గుంపులై యమ్మ
హాధ్వని విని భయంపడి రంతయు. ౬౬

క. విస్మృతాస్యములై యెల్లెడ, నవిరళముగ వ్రాలినట్టి మాశిరములు సొ
చ్చి వెసన్ గుహునిభయంబున, నవినోరులుమూయకగమ్మగాదులుమసెన్

వ. అంత పార్వతీసుతుండిది మాయాకృత్యం బని మనంబున దలంచి యొక శి
రంబును బాణిద్వయంబునుం దక్క తక్కిన వన్నియుఁ జక్కాడినఁ దత్కర
శిరోవ్రాతంబులుఁ గ్రమ్మర నుద్భూతంబు లగుటం గనుంగొని నాసాగ్రం
బున దర్జనిం జేర్చి భర్జించుచు శాసించిన నతని బాహు మస్తకంబులు
మరల మొలుపు సూపక నిలిచె నప్పుడు. ౬౮

సీ. అహహా! గుహనాజ్ఞ జగతి నేమనఁగవచ్చు, ముడిచికొనిపోయె దావేల్ప మోములట్ల
తన్మహాభీతివలనహస్తములుదలలు, మగుడ వెడలక దానవమౌళి కెలమి.

వ. ఆసమయంబునఁ బాణిద్వయమోపేతుండు నేకవక్త్రుండును నగు నద్దనుజపుంగ
దరుం గనుంగొని స్కందుండు విస్మయమాన వదనారవిందుండగుచు ని
ట్లనియె. ౭౦

క. ఛిన్నంబులు మరల సము, త్పన్నంబులు నగునటంచు దద్దయు నతిద

రోప్పన్నతి నుంటివి భ్రాంతుడ!, కన్నారఁగ నస్మదాజ్ఞఁ గంటేము పుడన్.

చ. అనఁడు తదుక్తులన్ వినిమహాసురి తాత్ముఁడు దానవుండు ప
ల్కెను గడురోష మొప్పనవ • లేప మిదేటికి రోరి నీమనం
బున నిలు మాజి నేకశిర • ములన్ భుజయుగ్మముతోడ నేనియున్
జెనకి భవన్మదంబణఁగ • జేసెదఁ జూడుము నాప్రతాపమున్. ౭౨

వ. అని మహారావ ముఖరిత హరిన్ముఖుఁడగుచు సింహముఖుండు షణ్ముఖుని
పై నొకనగంబు పెకలించివైచిన నతండొక్క బెడిదంపు టంపఁగోలన న
ది విదారించెనంత. ౭౩

క. శరములను సమరనైపుణి, చురయఁగ నీకున్ బ్రశస్త • మన్యాయుధ సం
గరమున్ గరపలవడదని నిరసింపుచు దానవుండు నిష్ఠుర భంగిన్. ౭౪

క. రోషాగ్నికీల లడరఁగ, నాషణ్ముఖుమీఁద వైచె • నత్యంతంబున్
భీషణమగు దండముగడు, ఘోషం బడరంగ సమర • కుంభిని యందున్.

—• కుమారస్వామి సింహవక్త్రుని సంహరించుట •—

వ. అప్పు డప్పార్వతీ సుతుం డనేకకోటిమార్తాండ సదృశ తేజో విరాజితంబును
నతిభయదంబును నగు శక్త్యాయుధంబుఁ బరపిన జగంబులు నశాంకం జే
యుచు మహారవంబడర వెడలి తదీయదండంబు ఖండంబులుగావించి యు
రోమండలంబు భేదించి నిమిషమాత్రంబున నద్దురాత్ముని ప్రాణంబులుగ్ర
సించి గంగాతోయంబులఁ గృతావగాహంబై మరలి పూర్వవిధంబునస్కం
దుని కరారవిందంబునఁ బొలుపొందె నంతయు. ౭౬

క. రుధిరములు నోటఁ దొరఁగన్, గుధరంబు తెలంగువ్రాలి • కుంభిని నానా
విధముల నటునిటుఁ బొరలుచు, నిధనంబును బొందె వేగ • నిశిచరుఁడపుడున్

వ. ఇట్లు విగతప్రాణుండైన యప్పాపాత్ముని గని దివిజులు సంతుష్టాంతరంగు
లగుచుం బుష్పవృష్టి గురిసిరి. సమస్తభూతంబులును బ్రీభూత కోలాహల
సమేతంబులై చెలంగె నంత. ౭౮

శా. రాజద్వైభవుఁ డద్రిజాసుతుఁడు వీ • ర వ్రాతముల్ భూతముల్
జే జేలం గొలువంగ వాద్యరవముల్ • చెన్నొంద మాణిక్య రే
ఖాజాంబూనద దీప్తిబంధుర మహా • గారావళీ నిస్తుల

ధాత్రిజశ్రేష్ఠము హేమకూటపుర మొ । ప్పం జేరె నుత్సాహియై. ౭౯

వ. ఇట్లుం జేరి నిజమందిరద్వారంబున రథంబు డిగ్గి భూతవీరులను యథా స్థానంబుల కనిచి దివిజులతో నంతఃపురంబు ప్రవేశించి రత్నసింహాసనాసీనుండై యుండె నాసమయంబున నఖిలభూతగణంబులును గుహుని యనుమతి వడసి నిజస్థానంబులకుం జని సుఖం బుండిరి. తదాఖ్యానం బెవ్వండేనియుం బఠించిన వినిన నతండు సకలాభీష్టంబులం బొంది శత్రువిజయంబు గాంచుం బూర్వకాలంబున నగస్త్యుని వలన నిక్కథవినియకా దశరథాత్మజుండు సంగరాంగణంబున రావణాదులం జయించె నని చెప్పెసూతుండు మఱియు శౌనకాది మహామునులకు నిట్లనియె. ౮౦

—: శూరుఁడు యుద్ధమునకు వెడలుట. :—

క. అంతట శూరుఁడు దూతము, ఖాంతరమున సింహవక్త్రు । నంతిమదశ న
త్యంతము విని బహుశోకా, క్రాంతత ధరఁబడియె గోపు । రంబున నుండిన్.

తే. హరిచతుర్ముఖప్రముఖులౌ । నఖిలసురలు, నిజపదంబులఁ బొందంగ । నేఁడుగలిగె
మత్కృతశిక్షాధాన ఖేదంబు । మానిరకట, తనుజ! యీదృశావస్థ రా । నగునె నీకు.

వ. అని యనేక ప్రకారంబుల విలపించి కొండొక దడవున కసురేంద్రుండు త్యక్తశోకుండై లేచి శీఘ్రంబ సింహాసనం బధిరోహించి యత్యంతకోపవిస్ఫురితలోచనుండై యిట్లనియె. ౮౩

తే. తనయజాండంబులందలి । దనుజవరులు, సింహవక్త్రునికంటెవి । శేషముగను
బలపరాక్రమధారేయు । లలఘుయశులు, గలరువారల రావించి । గరిమ మెఱయ.

వ. ఏను సంగరంబున కరిగి యబ్బాలుని జయించి క్రమ్మర మత్పురంబు సేరెద నని తలంచి సహస్రకోటులగు దూతల నఖిల బ్రహ్మాండంబులకు నియోగించిన, వారలాక్షణంబ చని తత్తద్బ్రహ్మాండ సంస్థితులైన దానవులకు శూరవచనంబు దెలిపి సత్వరంబుగా మగుడి వచ్చిరియ్యజాండంబున కంత. ౮౫

మ. సకలాజాండములందు నుండు ఫలభు । క్సైన్యంబు లుద్యద్రివిణో
త్సుకతర్ష నిర్భర భూరిఘోష మదరక్ష । దోర్దర్పముల్ మీఱ వా
రక నేతెంచె హరోత్తమాంగతటినీ । రంగత్తరంగ చ్ఛటా
ప్రకరంబుల్ పరతెంచు వైఖరిని శుం । భత్ప్రోధి ఁజూపట్టఁగన్. ౮౬

వ. వెండియుఁ బరమేశ్వరేచ్ఛాసంజాయమాన చరాచర జంతుసంతానంతో వ్యమానజగజ్జాలంబును బ్రహ్మాండ బిలపథంబున వెడలి విసీల నిజ తను తమః పటలంబు లాదిత్యాది పుంజంబు లాక్రమించి లోకంబులు గ ప్ప జవన సముద్భవ పవన మహారవంబుల భువనంబులు వణంకఁ జరణో ద్ధూత పరాగపరం పరలు సప్తార్ణవంబులు శోషిల్ల పాదన్యాస వేగంబున బ్ర హ్మాండంబు పరిస్ఫోటితంబుగా సైన్యంబులతోడం జనుదెంచి మహాబలుల గు దనుజవీరులు భూనభోంతరాళంబు పాతాళంబు నిండి రప్పుడు. ౮౭

క. చరియింపఁగ నచ్చోటను, హరిధీముఖసురలు తమకు • నవకాశము లే కురుతర భరముం బొందిరి, గిరులుం జమురయ్యె బలము • గ్రిక్కిరియుటచేన్.

క. దానవసేనాముఖమది, యానేర్చు బ్రహ్మాండభిత్తి • నవకాశం బెం తేని యొసంగక నాగత, దానవకోటులకు నపుడు • దగ గ్రిస్సూర్తిన్. ౮౯

వ. తదాగమనంబు విని శూరుండు పరమామోదంబున నంతఃపురంబున కరిగి కృతస్నానుండై భోజనాదులం బరితుష్టిం బొంది త్రిపుండ్ర రుద్రాక్ష మా లికాలంకృతదేహుండును- దివ్యచందనమాల్య విభూషితుండును-దివ్యాంబ రాభరణ శోభితుండును- మహేశ్వరదత్త పాశుపత బ్రహ్మాద్యనేక దివ్యా స్త్రధరుండును నగుచు రణోద్యుక్తుండయ్యె నయ్యెడ. ౯౦

సీ. అధరీకృతాష్టదిగ్ • గాచలాయుత చక్ర, నేమికానిర్ఘోష • నిబిడభయద మభ్రంకష సముద్య • దమితసింహధ్వజ, బహుళశస్త్రాస్త్రవి • భ్రాజమాన మరుణపరిభాడంబ • రాంబరపిహియ బింబ, దురుశాతకుంభకుం • భోజ్జ్వలంబు సప్త సహస్రాశ్వ • శార్దూలవాహ్యము, భూతపిశాచ సంఘాతబద్ధ

తే. మనలమాన నతుల్య వే • గాన్వితంబు, వీరయోగోద్భవము మహా • ఘోరతరము నై నరథమును సింహవాహనము నొకటి, దెచ్చిరవ్వేళ తోడన • దితిజనపులు.

ఉ. అవుడు రథాగమంబునకు • నద్రులు ధూల చలించె శీతల ద్యుపనుఁడు గాంచె బొంగె శమనంబును బాడబవహ్ని యంతయున్ విపుల తరంగ ఘోషములు • నిండగలంగె పయోధు లేడు ది గ్ద్వీపములుం గంపమొందె పృథి • వీతల మల్లలనాడె నాకమున్. ౯౧

వ. అంత తదధిరూఢుండై దానవేంద్రుండు సకలదనుజకృతాశీర్వాదుండు ను బటహభేరీకాహళాది మహారావ ముఖరిత హరిన్ముఖుండును ఘనుజసు

వాసిసి పరిశస్త్రహస్తారవిందవికీర్ణసుమబృందశోభితుండును వందిమాగధ సందోహపఠితబిరుదావళీవిభ్రాజమానుండును నగుచు రథచోదనంబు న సారథుల నియోగించి మేరుసంగతంబగు నీలశైలంబు పోలుపునం జెలువొందుచు నిరుగెలంకులం గొందఱు ఛత్రచామరధ్వజపాణులును గొందఱు తాంబూలపేటికాపాణులును గొందఱు కళాచికాధరులును గొందఱు కనకభృంగారు పరిశస్త్రహస్తులును నిఖిలసముద్ధతకోలాహలంబు లడరం బురవీధులు గోపురమంటపంబు లతిక్రమించి పరిఘానగోపురద్వారంబు సేరె నయ్యెడ. ౯౩

తే. కూడియున్నట్టి దానవకోటు లెల్ల, దనుజకులసార్వభౌమునిం గనిరి వేడ్కమీ గిలకిలార్భటిం జేయుచుం గేలు సాచి, ధములధగధగద్దీప్రులు దరుచు మెఱయ.

వ. అంత శూరుండఖిల దనుజబలసమేతుండై గంధశుండాల ఘటాగండనిష్యంద మానదాన ధారాపూరితంబగు పురపథంబు వలనం జని రణాంగణంబు డాసె నప్పుడు. ౯౬

క. జవమునఁ జనికొందఱు దా, నవభటులా హేమకూట నగరము నడ్డ ద్రిపమొసఁగ నిరోధించిరి, వివిధాయుధపాణులగుచు విక్రమమొప్పన్.

—దేవతాప్రార్థన చేతఁ గుమారస్వామి యుద్ధమునకు దరలిచుట—

వ. ఆసమయంబున మహాభయంకరాకారులగు సురవైరులం గని బ్రహ్మవిష్ణు ప్రముఖనిఖిలదివిజులును మూర్ఛిల్లిరి. వీరలును భూతంబులతోడ భయం పడి రంత బ్రహ్మాదులు గొండొకసేపునకుఁ దెప్పిరిలి మహామహుండగు గుహుని చరణారవిందంబుల కెరగి యిట్లని విన్నవించిరి. ౯౮

క. దుర్వారమహిమశూరుఁడు, సర్వాండంబులవసించు సకలదితిజులన్ ఘూర్ణహత గూడియిప్పుడు, గర్వమునన్ వచ్చెఁ గంటె కదనంబునకున్. ౯౯

తే. అతని సేనాముఖంబడె యడ్డగించె, దేవ! తావకనగరంబు దృఢతరముగ నమ్మహాపాపి దనుజుని నాజిఁ దునిమి, కరుణ బాలింపుమమ్మెల్ల కరిమధురీణ!.

వ. అని యిట్లు విజ్ఞాపనం బొనర్చిన వారలవచనంబులు విని పరమకారుణికుం డైన కార్తికేయుండు పవనుం బిలిచి రథంబొండుత్తమంబు దాఁ జేర్పించి తెమ్మన వృషు సత్వరంబుగ నది దెచ్చి యాయిత పఱచె నంత పార్వతేయుండును సింహాసనంబు డిగ్గి. ౧౦౦

క. బహురత్నవిచిత్రితంబును, మహితజవోన్నతతురంగ • మణిబంధంబున్
మహనీయంబగురథమున్, గుహుఁ డధిరోహించి సమరకోవిదుఁ డగుచున్.

ఆ. చక్రదండముసల • శరశరాసనశూల, కులిశఖడ్గఖేట • కుంతపాశ
శక్తితోమరాది • సకలాయుధంబులు, గడుధరించిశౌర్య • గరిమ మెఱయ.

సీ. నవవీరులును మహో • న్నతలక్షవీరులు, వినుతుంబురంజిల్ల • వేడ్కఁ గొలువ
ద్విసహస్రవాహిను • లెసఁగ గంగ భూతంబు, లతులవిక్రమలీల • నడుగు దేర
బద్మగర్భాదిసు • పర్వులు సత్యంత | సంతుష్టిబుష్పవ • ర్షములు గురియఁ
గల్పాంతఘనఘనా • ఘనఘోషమట్లును, బటహభేరీధ్వనుల్ పరిఢవిల్ల

తే. చామరచ్ఛత్రకేతన • సముదయములు, వారిశౌర్యాంకదీపంబులై వసుఁజెలఁగ
వంది కైవారముల్ మిగుల • సందడిలఁగఁ, గదనమండలి కరుదెంచె • క్రౌంచ
భేది. ౧౦౩

— భూతంబులు రాక్షససేనలఁ జూచి భయపడి గుహస్వామినిఁ జూచి ధైర్యము చెంది
యుద్ధమునకు సన్నద్ధు లగుట. —

వ. అప్పు డఖిలభూతంబులు క్రూరకర్ములగు నమ్మహాదానవులం గని వెఱగు
పడి పరస్పరంబు భయంబునొందుచు నిట్లనిరి. ౧౦౪

క. కరములు శిరము లనేకము, లఱుముగఁ జూపట్టి భీక • రాకృతి నష్ట
త్రరసాహస్రాండంబులఁ, బరగు మహాదైత్యు లిపుడు • పరతెంచిరొగిన్.

సీ. లోకంబు లన్ని పరి • పాకంబు శాసింపఁ, జాలిననిరుపమ • సాహసాధ్యు
లబ్జజాండంబులు • నలర విక్రమలీలఁ, గలిగింప నిపుణులౌ • కర్కశాత్మ
లంభోనిధులు పోలె • నలరారువక్త్రముల్, గలిగిన భీకరా • కారయుతులు
రవిచంద్రతారకా • గ్రహమార్గముల మించు, శిరములరాజిల్లు • పరుషతనులు

తే. చటులతరవహ్నిఘనశిఖా • చ్ఛటల నెనయు, నేత్రములు గలిగ మెఱయు
నిర్నిద్రశౌర్యు
లహహ! వీరల నెదిరించి • యాహవమున, సాహసముఁ జూపనెవ్వాఁడు • శక్తుఁ డగును.

వ. మఱియు భానుకోపతారకసింహముఖాగ్నిముఖవ్యాళీముఖులును సుందో
పసుందులును మధుకైటభులును జలంధరమహిషాసురులును మొదలగువీరు
లందఱు మహాబల పరాక్రమ సంపన్నులును మహాక్రూరులును బ్రాహ్మ్యా
వైష్ణవైంద్రాగ్నేయాద్యాయుధ సమేతులును ననంతకోటి సంఖ్యాకసేనా

సహితులునునై యేరికిం జలసూపరాకుండఁ బ్రకాశించుచున్న వారలుత్పో ల్లి మనమిందఱ మొక్క బ్రహ్మాండంబునందుఁగల దానవులచేతఁ గోలుపో యిన వారమగుటం జేసి యప్పాపాత్ములమోౢల మనకుఁ బ్రాణ సంరక్ష ణంబు సందియంబగు నద్దనుజసైనికులలోన నొక్కఁడొక్కండ మనసేనలం గల బలుపగల నందఱం గెలువనోపునట్టి మహాబలుండై దేనియు ననేకబ లంబులతోడం గూడికొని సమరంబునకు సమకట్టియుండఁ శిలామహీరుహం బులతోడఁ గయ్యంబుసేయుచు మనశక్తి వారిపై నెట్లుగెలువనేర్చు మహాప్ర రుంఢగు వీరబాహుండేనియు నోర్వఁజాలండని త్రోచుచున్నయది. ఇంక సా హస్రార బ్రహ్మాండంబునగు బాహులేయుండు వీరల నందఱ జయింపసమర్థుం డగుచుండుటం జేసి మనకుఁ దొలఁగె ననుట కవకాశంబు లేదుం గావున దవానలంబు పయిం బడు మిడుతలవడువునం బడి మడియవలయునని పరస్ప రంబు నుడివికొనుచు భూతసైనికు లొకరొకరు ధైర్యంబులుం బురికొనం జేయుచు నిశాటసైన్యంబులపైఁ దలపడి రాసమయంబున. ౧౦౪

క. సేనాధిపులును వీరులు, దానవులం గనియు నపుడు ♦ తమభుజబల మెం తేనియుఁ బరస్పరంబుం, బూనికి సంగ్రామమునకు ♦ భుజశౌర్యములన్.

వ. అప్పు డిందాౢదినిలింపులు గుంపులై మురవైరింగని యిట్లనిరి.

చ. అతిదురితాత్ములైన దను ♦ జాధిపులందర వీరినాజిలో
హతులనొనర్ప కిట్లు దివ ♦ సావళిఁ బుచ్చె గుహుండ దేలకో!
దితిజవరుండు శూరుఁడని ♦ చెప్పుట యెన్నఁడొ! సర్వదేవతా
తతికివిమోచనం బెపుడొ ♦ తాముసుఖించుట నింక నెన్నడో! ౧౦౫

వ. దేవా! నిజపదప్రాప్తి యెన్నండకో! యేమునొడలప్రాణంబులు గలిగి యేత త్సర్వంబుఁ జూడగలమేయని దైన్యంబునం బలికిన విని హృషీకేశుండు సు రల కిట్లనియె. ౧౦౬

—♦ విష్ణుమూర్తి కుమారస్వామి సామర్థ్యమును వర్ణించుట. ♦—

క. సాక్షాత్పరశివుండౌనిట్, లాక్షుఁడు మన కెపుడు కర్త ♦ యధ్యక్షుఁడునై
రక్షించు గుహాకృతిచే, నీక్షణమునఁజింతసేయ ♦ నేటికి మదిలోన్. ౧౦౭

మ. సకలాజాండములున్ జగంబులు విలా♦సంబొప్పఁగాఁ జూపె బా
లకుఁడై యెవ్వఁడు రోమజాలముల లీ ♦ లన్ బంచకృత్యంబులన్

బ్రికటించుగాక నెవ్వఁడా గుహునకీ ♦ పరిశ్యర్థిని గ్యాణంబు
బాలభారంబుగా! దుఃఖించుసీతుణము నగ ♦ బోరిద్వృత్సిసిరి దైత్యులక. ౧౧౩

క. సురలారమీరలివ్విభు, నిరుపమమహిమ మురచితిరో ♦ నీవ్రగ దివిజే
శ్వర! చూడకు శిశుబుద్ధిని, శరజన్ముమహానుభావు ♦ జగదీశ్వరునిగా.

క. ఏతపము చేసినారొ మొ, యీతండు మహానుభావుఁ ♦ డీశ్వరతనయుం
డేతాదృశశుభరూపస, మేతుండై మనఁ బ్రోవఁ నేతెంచెఁగృపగా. ౧౧౫

క. నగిమైనఁగినుకనైనగ, మిగులగ సహాసమునైన ♦ మేదినిలోనం
జగడముననైన శూరా, దిగఁబొరిఁగొన శక్తుఁడితఁడు ♦ దితిజుల నెల్లగ.

వ. ఇమ్మహామహుని యద్భుతంబగు బలం బెవ్వఁడెఱుంగ నోపు ! భృతాయుధం బులగు భూతంబులును బలపరాక్రమ సంపన్నులగు వీరులును వినోదంబునం గూడికొని యిప్డు యుద్ధంబునకుఁ జనుదెంచి నిమిష మాత్రంబున నసురుల నందఱం బరిమార్చి శూరపద్ముని సంహరింపం గలండు మద్వచనంబు సత్యంబని ముకుందుండు పలికినఁ బురందరాది బృందారకులు సందియంబు మాని డెందంబుల సకలశత్రుబృంద సంహారకుండును సత్యజ్ఞానందమయుండును నగు స్కందునిం దలంచుచుండి రాసమయంబున,

—♦ కుమారస్వామి యుద్ధస్థలమున కేగుట. ♦—

క. హరివిధులతోడ సత్వర, మరుదెంచి సమస్తదివిజు ♦ లాగుహుని వెంటగా
బరమప్రేమను జనిరా, హరసూనుఁడు చూచి మందహాసము మీరగ.

వ. సర్వగీర్వాణసమేతుండై వీరబాహుప్రముఖులతోడ గుహుండు ద్వారయోధనస్థలంబుఁ జేర నయ్యెడ, ౧౧౮

క. భూతంబులు రాత్రించర, వ్రాతంబులతో నునర్చె ♦ రణమపుడు మహీజాతంబులు పర్వతపం, ఘాతంబులు గురియుచును బ్రౌగల్భతమెఱయుగా.

వ. ఇట్లు రణం బొనర్చిరంత, ౧౨౦

క. ఒకచో సేనానాయకు, లొకచో వీరులును దనుజ ♦ యూథులచే వారకపరిభవ మొందుచుఁ గడు, వికలతనాశాంతములకు ♦ వెసబఱచి రొగిగా.

ఆ. వీరబాహుఁ డపుడు ♦ వేగంబయున్నత, ధనువుఁబూనిపట్టుచు ధైర్య మెసఁగ
బాణతతులు బరపి ♦ బహుదైత్యులను దునిమి, మఱియు వారితోడ ♦ మహారొజనంగ, ౧౨౨

వ. సమర్థుండవుగాక పరాభవంబు నొంది గుహుని పాఱిపోవఁ జేసెద నష్టాపదా
త్ములగు మహాఘోరదైత్యులునక్కుమారుఁజుట్టుకొని యిబ్బాలుండాలంబు
సేయనేర్తుండగునే! యని పచరింపుచు దండచక్రకులిశ శక్తిప్రాసతోమరా
ద్యాయుధంబులువర్షింపుచుఁ బెడబొబ్బలిడుచుఁ జక్కమొగినురవణించిన.

—◆ కుమారస్వామి దైత్యులతో యుద్ధము సేయుట. ◆—

మ. కని యాదైత్యులఁ గార్తికేయుఁడు మహో◆గ్రంబైన రోషంబునన్
ధనువుల్ సజ్యముచేసి భీషణముగాం◆ తస్ఫూర్జదంభోధర
స్వనముల్ పోలెను శింజినీరవము భా◆ స్వత్ప్రౌఢి గావించెద
న్నినదంబుల్ వినిమూర్ఛనొందె దనుజా◆నీకంబు గంపింపుచున్. ౧౨౫

వ. ఇట్లు మహామహుండైన గుహుండు దుర్వారంబుగా మౌర్వీనినాదంబు చే
సి నిశిత శిలీముఖంబు లనేకంబులుం గురిపి రక్కసుల ముక్కులు జెక్కు
లును మూపులు వీపులును కాళ్లును వ్రేళ్లును శిరంబులును నురంబులును
ఖండించి కొండలఁ జెండు నాఖండలు విధంబున భండన మండలంబున వ
ఖండప్రతాపంబు చూపుచు. ౧౨౬

సీ. వాలంబు లంఘ్రులు◆వదనముల్ నుసుమాడి, ఘోటకసంఘముల్◆ గూల్చి గూల్చి
చక్రంబులునుధ్వజ◆స్తంభముల్ జక్కాడి, స్యందనబృందంబు◆చిదిపిచిదిపి
గండస్థలంబులు◆శుండముల్ ఖండించి, శుండాలతండముల్ ◆ చెండి చెండి
శస్త్రచామరములు◆ఛత్రముల్ పొడిచేసి, రమ్యభూషణరాజి◆ రాల్చిరాల్చి
తే. ఘోరదైత్యులశిరములు◆కొట్టికొట్టి, పెట్టుగరణోర్వి చుట్టలు◆పెట్టి పెట్టి
గట్టురా పట్టిన ద్వుల ◆ పట్టి యూఁచి, విక్రమక్రీడఁ జూపట్టె ◆ విస్మయముగ.
మ. ధరపాతాళనభస్తటంబులు వియ◆ద్భాగంబు స్వర్లోకముల్
హరిలోకంబును బ్రహ్మలోకమును బ్ర◆హ్మాండోర్ధ్వ భాగంబు వి
స్ఫురణన్ నిండియు మాఱుమ్రోయ పటుదో◆ర్జృంభచ్ఛరాసారముల్
పఱిమార్చెన్ గ్రుమ్మయొప్ప సంగరకళా◆ పాండిత్యులన్ దైత్యులన్. ౧౨౭
తే. తాపసామరసంఘంబు◆ దక్క గుహుఁడు, దానవుల నెల్లనెల్లెడ◆ దర్పమణఁప
తచ్ఛిరంబులుగా హుతా◆స్తకము పఱిడి, చరాచరమను జగం◆ బెల్లనిండె.
క. దితిసుతఖండితహస్త, స్థితములగు మహాయుధములు ◆ శివశతసంఖ్య

పరితర్జ భేరితమగుచును, హతమ్ముగ గావించెబోర నసుర గణంబుల్.

వ. ఇట్లు నానాప్రకారంబుల దానవ గణంబులు హతంబులగుట ప్రత్యక్షంబు గనుంగొని హరిబ్రహ్మాది దేవతలు వీరసేనాధిపులు సంతోష భరితాంతరంగులై రంత మఱియుఁ బూర్వంబట్ల వేరొండజాండంబుల నుండి చనుదెంచి నిండిన సకల వసుజులం గనుంగొని మున్ను వచ్చిన దానవులని వారలు భ్రమసియున్నంతలోన సద్దైత్యుల గుహునకు విగతప్రాణులఁ జేసె నట్టి యమ్మహానుభావుని బరమాకాశంబున సురగణంబులు సంస్తవంబులు చేసి రంతయు. ౧౩౧

క. దివిజారులెల్ల సంగర, భువినీల్గిన నయ్యఖండ మున నాక్షణమం దవకాశమలరినిండెను, జవమునఁజనుదెంచె నసుర సైన్యము మగుడన్.

వ. ఇట్లు నిండి పాపకర్ములైన ఘోరపక్షం జేరి కోలాహలంబులొనర్పుచు.

సు. ధరణీమండలి నమ్మహాసురకటంబ శ్రీశిశ్నోదముల్ గరిమన్ మెట్టి తదీయకోటితమహాకల్లోలిపల్ దాటి స త్వరతన్ ఘోరభవన్విరోధి నతంబ దర్పాబణాగింతు మం చు రహింబన్ని ప్రతిజ్ఞ విక్రమములన్ జూపట్టె నంతేనియున్. ౧౩౨

వ. సకలవైరిసంహారకుండగు హరకుమారుం గని యబ్బాలుండు రథగజతురంగంబు లేమియునులేక యొక్కరుండ బ్రహ్మాండాంతరాగతరక్షోవీరుల సమూహంబులం బరిమార్చె నని యతని సాహసంబున కాశ్చర్యంబునొందుచు నమ్మహామహుం జుట్టుకొని దనుజసైనికులు ఘోరాగమనంబునకు మున్నెయితని సంహరించెద మని వివిధశిఖాయుధంబులు వర్షించిరప్పుడు.

క. భూతగణంబులువీర, వ్రాతము సేనాధిపతులు వారకచింతా భూతాళయులై రంతయు, నాతరి కరుణాసముద్రుఁడగుగుహుఁడెలమిన్

వ. సారధియగు గంధవహుం గనుంగొని మందస్మితకలిత వదనారవిందుం డగుచు గంభీరవచనంబుల నిట్లనిను. ౧౩౩

క. అనిలా! నీనై పుణ్యం, బనితర సాధారణముగ వరదము నాజిన్ ఘనమతి నడుపుము ముందఱ, వెనుకను బార్శ్వములనసురు వెసనల్లెడలన్.

వ. అని పలికిన నమ్మహారథికువచనంబులు విని యనిలుండు భూనభంబులన దీర్ఘముద్వంబుల లోకాలోకంబుల సకలదిశలను దనసారథ్యకౌశలంబు మె

ఆయ సరసంబు సర్వీరంబుగాఁ బరపె వాసమరుంబున సకలశాత్రవాజే-
యుండగు నబ్బాహులేయుండు రక్కసుల మూఁకలపై నిశితవిశిఖ పరంపర
లు పుంఖానుపుంఖంబులుగాఁ బరపిన నమ్మహాశరంబులు గాఁడఁ బోడిమిసెడి
రథంబుల దొరుగు రథికులును రథికులకు బాసటలై వచ్చి తద్బాణంబు
లు తనుత్రాణంబులుచ్చి పొందిన ప్రాణంబులను నిలుపరింపనోపక కరవా
లంబులపై నొరగు సాదులను సానోరణులకఁ దోడుసూపుచుఁ బిసుగు
లువోని బెసిగంపు నారసంబులతాకున నీరసంబులు దక్కి యుక్కడలి
యొడలి పటువంబు సాలక మొల్లంబు సెడి యొల్లంబోవుచు నెత్తురులుగ్రా
త్తిల ప్రడమింబపు రాహుత్తులను రాహుత్తులకు సహాయంబగా మొత్తం
బులై చనుదెంచి పరుషతర శిలీముఖంబుల ఘట్టనలకు నెట్టన నిలువలేక
సొమ్మసిలి నేలంగూలు కాల్బలంబులును మఱియు నమ్మహామహుని శాత
సాయకంబులఁ దుండంబులు ఖండితంబులైన బిరబిరం దిరిగి ధరం దిరుగు
వేదండంబులును ముందలి పదంబులుం దెగిన మొడలు బెడమఱలి మొగ్గ
రిలంబపు సర్వంబులును ఘోరనారాచంబులచేత సారథులతోడనుగ్గ నూ
చంబులగు శకటంబులును నై దనుజబలంబులు వేఱుపఱచి పరనిమెండఁ
బోయిన నెటుసొచ్చినఁ దద్బలంబుల పెల్లు దప్పించుకొను వెరవుసాలక
నెందెంనునుండు దనుజయోధులును నాయోధనంబున హతులైరయ్యవస
రంబున పిసరినరుధిర జలంబులు నువిదళితధవళాతపత్ర ఫేనంబులును విస్రి
స్త శిరోజాత శైవాలంబులును విలూనపతాకమీనంబులును విదారితహయ
కబంధ మకరంబులును విఖండిత శిరః కమఠంబులును విచ్ఛిన్న వేదండ గం
డశైలంబులును గలిగి రణాంగణంబు సముద్రంబు సొంపు సంపాదించె న
ట్టియెడ. ౧౩౯

క. మృతిదైత్యసైన్యభరమున, క్షితితలమెల్లను జలించె శేషుని తోడన్
గుతుకమున సారమేయ, వ్రతతియు ఖేరవులు కుణప పంక్తులు మెసవెన్.
తే. ఉదయభాస్కరబింబముల్ గడఁగ్రసించు, రాహువులువోలె నెంతయు
రహి నెలంగె
ఖేచరయుక్తంబులై వ్యోమవాటి దనుజకరము లెంతయు బహుభయంకర
ము లగుచు. ౧౪౦

వ. మఱియు దైత్యరథాకర్షణయంత్రితంబులై మహాఘోరంబులగు భూతప్రేతపిశాచంబులు మాంసభక్షణాపేక్షం బరివర్తిల్లెనంతియు. ౧౪౨

తే. అఖిలజగములు వ్యాపించె నస్త్రభయము, నస్త్రవేగంబు కంపెను • నతిశయముగఁ
బటురయంబున బవనుండు • పరపెరథము, దరమునిఁగుహులివిక్రిమం బెన్నఁ • ధరణిలోన. ౧౪౩

వ. ఇట్లు తద్రథవేగంబును శరాసనపాటవంబును సారథ్యకౌశలంబును గనుంగొని యిది మహామహుండగు విఘ్నహుని సామర్థ్యంబో! లేక శస్త్రాస్త్రమహిమంబో! యని బ్రహ్మవిష్ణులును వియచ్చరులచ్చెరువందిరంతియు. ౧౪౪

క. ఈకరణిఁగుహుఁడు దైత్య, నీకముఁబరిమార్పఁకుణుకని సహము రుధిరా
ప్తోకపరివాహములుభూ, లోకంబును మఱియు సురగ•లోకము నిండెన్.

వ. ఇట్లనేకకోటిసంఖ్యాకులును మహాభయంకరాకారులును నగు దనుజవీరులు హతులగుచుండ నవ్వేళ మఱియు వేరొండు బ్రహ్మాండంబుల నుండియు మగుడ పూర్వంబట్ల సర్వాయుధపాణులునుసమరాంగణభయంకరులును నగు నసురు లరుదెంచిన వారల నాక్షణంబ గుహుండు రోషభీషణుఁడై బరిమార్చె నప్పుడు. ౧౪౬

క. ఈరీతిమాటిమాటికి, నారాక్షసు లరుగుదేర • నాజిఁ దునిమి వే
మారుకుమారుఁ డజాండ, ద్వారంబును గప్పె విశిఖ•తతులన్ గినుకన్.

వ. అంత మార్గాభావంబగుటం జేసి నిశాటవర్గంబు నిర్గమింపక నిలిచెనజాండభిత్తిపర్యంతంబు గతప్రాణులగు నసురుల కుణపంబులు పర్వతంబులట్ల తదీయ రక్తంబు లర్ణవంబులుం బోలెఁ జూపట్టె నంతయు. ౧౪౮

తే. కుణపశైలంబుల్లను జూచి • కొమరుసామి, మందహాసంబు సెలువొంద • మహిమ మెఱయ.
ద్వాదశప్రగన్నికీలల • వాని నెల్ల, భస్మములు సేసె దుర్వార•పటిమ మీర.

వ. అంతఁ బూర్వప్రకారంబున నవకాశంబేర్పడం గలిగె నప్పుడు హరిబ్రహ్మాది సకలదేవతానికరంబులు సర్వసురస్వాగ్రగణ్యుఁడగు సుబ్రహ్మణ్యమహామహిమకు నానందించి రుధిరార్ణవపరిప్లుతంబుగా నద్దురాత్ముల వధించి నేత్రాగ్నిలంబున భస్మీభూతంబులం జేసె నింక నిమ్మహామహుని

కు శూరపద్మసంహారం బేమి భారంబని పరస్పరంబు నుడివికొనుచుం బ్రణమిల్లి స్తుతిశతంబు లొనర్చి రంత. ౧౫౦

—: కుమారశూరపద్ముల యుద్ధము. :—

తే. శూరపద్ముండు కోపవిస్ఫురణమెఱయ,శివకుమారుని నెదిరిభక్తింప మగుల
నద్దురాత్ముని చటులత• రాగ్రహంబు,గడలుకొనంగ నెదిర్చెశ్రీ రుద్రసుతుఁడు.

వ. అంత దైత్యవల్లభుండగు శూరుండు గుహున కిట్లనియె. ౧౫౧

క. పరమేశ్వరుఁడగు శంకరు, పరమహిమ మదనకు నెపుడ • వధ్యత నొసఁగ
వరులెవ్వ రేని నాతో, దుర మొనరించినను బొందు • పరుపరాభవమున్.

వ. అనిన విని కుమారుండు గంభీరవచనంబుల శూరున కిట్లనియె. ౧౫౪

క. పాపివి నీతో నే నే,లా!పలుకఁగ గరుణమత్కు • లంబును త్వత్ప్రా
ణాపహతిఁ జేయకుందుటఁ, జూపల్మరు గర్వమహిమ • నూపెద నీకులకా.

వ. ఇప్పు డస్మద్బల పరాక్రమంబులు సూడుమని పలికినఁ బాపాత్ముండునగు దానవుండు కోపంబు దీపింప నున్నతంబగు శరాసనంబుం గొని గొనయ మెక్కించి యుక్కసంగ పిడుగులు వోసె బెడిదంపుటంపములు గుహునిసైన్యంబులపైఁ బరపె నప్పుడు. ౧౫౬

క. సేనాపతులును వీరులు, నానాభూతములతోడ • నారాచంబుల్
దానవుపై నొక్క మొగిన, నూనప్రౌఢిమ నుగురిసి • రున్నత పటిమన్. ౧౫౭

క. శూరవిముక్తశరంబులు, వారించి తదీయబాణ • వర్షంబుగదుర
ఘోరతరంబుగఁ దాకెను, వీరవ్రాతంబు భూత • వితతిన్ వరుసన్. ౧౫౮

వ. అప్పుడు కొందఱు విదారిత సకలావయవులునై పలాయనంబు నొందిరి. కొందఱు మూర్ఛాగతులై పడి రంతయు. ౧౫౯

ఆ. వీరబాహుముఖ్య • వీరులు గొందఱు, ఘోరబాణతతులు • గురిసి రపుడు
రాక్షసాధినాథు • వక్షస్స్థలంబును, దాకియవి యొగుంకిత • తంబులయ్యె. ౧౬౦

క. భూరితరబాహుబలుఁడగు, శూరుఁడు కోపమునఁ బరపె • సుంభచ్ఛరముల్
వీరులు మ్రొయను బరిపిన, దారుణశరములను దునిమె • దద్దయుఁ గడిమిన్.

వ. ఇట్లు దునిమి మఱియు ననేకశిలీముఖంబులఁ దదౌర్ధంబులు ధనువులును ఖండితంబులు గావించి బాహువుల మూర్ధంబుల పరస్పర శిలీముఖంబులం

జొనిపె మహాభీలంబుగాఁ గోలాహలంబు లొనర్చుచు నలుగడలం దిరు
గుచు వీరవరుల భర్జించె నప్పుడు. ౧౬౨

తే. రక్తధారాప్లుతాంగులై రణముఖోన, విగళితాంబరులగుచు నస్వీరులెల్ల
వెరచిపరచిరి చెనలను వీరబాహుఁ, డవియుఁ గనుఁగొని బహుకోపమును
డర మదిని. ౧౬౩

వ. ఎదిరించి రాక్షసుని రథంబును శరాసనంబునుం గరవాలంబున ఖండించె
నప్పుడు. ౧౬౪

క. పరిసరగతుఁడగు వీరు', సురవైరియు ముష్టమడర శుంభత్పటిమన్
గరతాడనమునఁ జిఱపిన, ధరణింబడిమూర్ఛనొందెఁ సద్ధమునతఁడున్.

వ. అంత శూరుండు దూతహననంబు శూరులకు యుక్తంబుగాదని యతనిప
దంబులు గేలం గీలించి గగనతలంబున కెగయవైచిన నతండా కాశపదం
బున నుండి నిమిషమాత్రంబున విగతమోహులండై గుహాంతరంబు సేరె
నంత. ౧౬౬

మ. ఉరుశౌర్యాఢ్యుఁడు సురారివల్లభుఁడు మహోత్కర్షమున్ మీరఁగా
గిరిమన్ గాంచ గిరీంద్రిసన్నిభము నుగ్రింబైన కోదండమున్
బరగన్ బూని మహాభయకరముగా భాస్వద్గుణారావముల్
విరచించెన్ గగనావనీతలములున్ వేమారు గంపింపగన్. ౧౬౭

వ. అంత గుహుండును మున్ను హరిబ్రహ్మాదిసంహరణసమయంబున బ్రహ్మాం
డపర్యంత పరివర్ధమానంబగు కైలాసంబు కంటెె మహోన్నతంబగు నా
శ్వ బాణాసనంబు గొని సజ్యంబు గావించి యనంతకోటి వజ్రాభీలరవం
బులం బోని మహారవంబు లడర గుణాస్ఫాలనంబుఁ జేసెనంతయు. ౧౬౮

ఆ. అంతసూరపద్మదంతకాకారుఁడై, కోపవహ్నిశిఖలు ఘూర్ణిలంగఁ
బ్రళయకాలమేఘపటలంబు విధమున, భయదరవమొనర్చెఁ భటుతరముగ

వ. పవనునిం బోలె నత్యంతజవములు నగ్నికరణి దాహకంబులు నంతకుఁబగి
ది మహాసంహారకంబులు మేరుప్రముఖవిదారకంబులు బ్రహ్మాదభేదకం
బులును క్ష్వేళజ్వాలాభీలంబులును సకలజగత్క్షోభకంబులు నగు శరంబులు
కోటి దశకోటి శతకోట్యర్బుదంబులుగా వర్షించిన దేవగణంబులు భయ

ఘూర్ణింతురై సత్వరంబుగాఁ జని కరుణాపరిపూర్ణుఁడగు విష్ణుదేవునిం జేరి శూ
రశరాసార పీడితులమగు మాకు నిలువ శరణం బెద్దియని ప్రార్థించినహ
రియు సురలకు నుత్తరం బిచ్చు నంతలోన. ౧౨౦

క. శరజన్మునియస్త్రావళు, లురుతరగతిఁ దచ్ఛరంబు లొగిఖండించెన్.
సురలదియుంగనుఁగొనిభా, సురముగ హర్షించిరెలమి సుముఖత దనరన్,

క. శూరుఁడు మఱియును దంబక,వారంబులు గుహునిమీఁద వర్షించెఁ గసున్
ధీరతినతఁడవి యన్నియు, వారకచూర్ణములుచేసె వర శౌర్యమునన్.

వ. మఱియు నేఁడు నూఱుబాణంబులు దానవునిపై నిగుడించిన నతండు తద్బ
లంబు లెల్ల సఫలంబులైనను విఫలంబులు గావించి ద్విసహస్రవిశిఖంబు
ల నాగుహుని పయిం బరపిన. ౧౨౩

క. ద్విసహస్ర శిలీముఖముల, నసదృశగతిఁ దచ్ఛరములనణచి నిశాత
ద్విసహస్రశరంబుల మఱి, యసురవరుంబర సెగు హుఁడుదగ్రస్ఫూర్తిన్.

వ. నిశాచరేంద్రుం డును దోడనద్విసహస్ర మహాశిలీముఖంబులఁ దదీయ నా
రాచంబులు ఖండించి శేషఫణి సహితంబుగా నశేష భూమండలంబు గ్ర
క్కదల సింహనాదంబొనర్చుచు ననంతకోటి సంఖ్యాకంబులగు శరానీకం
బులు వర్షించిన షణ్ముఖుం డవియన్నియు నడుమనం దునిమివైచె నిట్లు న
య్యిరువురు పరస్పర శరవిదారితంబుగాఁ బోరి రెంతయు. ౧౨౪

మ. అపు డన్యోన్యమహాస్త్ర ఘట్టనసము ద్యద్వహ్ని కీలంబు ల
భ్రపదంబంటె వియన్నదీముఖసరి త్ప్రాధోధులున్ శోషిలెన్
విపులస్థేముల వారి బాహుబలముల్ వీక్షించియప్పౌరల
క్ష్మపురస్సీమవసించె నెవ్వనినఁహా చేష్టుదంచన్ గసున్. ౧౨౫

వ. అప్పుడు వారి గాత్రంబులు శరవిద్ధంబులై నేత్రగోచరంబులు గాకుండెనంత
శూరపద్ముఁడు మహాసాహసంబున నమ్మహారథికు రథధ్వజంబులుభగ్నం
బులుగావించి సింహనాదంబు లడరశంఖంబు పూరింపుచు మఱియును.

క. అతిఘోరములౌ శరములు, దితిసుతపుంగవుఁడు గురిసె ధీరతనగజా
సుతుఁడును దన్నారాచ,వ్రాతములుదునుమాడెభుజప రాక్రమముప్పన్.

వ. వెండియు గుహుండు నిశితంబులగు సప్తవిశిఖంబులు సంధించి యుద్ధాన
పేంద్రుని రథకేతనంబును దునిమి సముద్రింబునం బడవైచె నంత.

తే. భూతగణములలోనఁ బేర్చి భూరిబలుఁడు, భానుకంపాఖ్యుఁ డరుదెంచి భవు
ని మహిమ
వేయిముఖముల శంఖముల్ వేయునొత్తె, భూరిఘోషంబు నిండార భువన
భవముల. ౧౭౯

వ. అమ్మహారావంబు బ్రహ్మాండభిత్తి పరిధ్వనులీనుచు సర్వాశాంతంబుల
నాక్రమించుచు ననేకయుగపర్యంతం బెడ తెగక మ్రోసె నప్పుడు హరియు
సంతోషంబునం బొదలుచుఁ బాంచజన్యంబు పూరించె నంతయు. ౧౮౦

క. అమరగణప్రార్థితుఁడై, యమరగ దహనుండు కుక్కుటాకృతి యగుచున్
గొమరొప్పఁ గొమరుసామికి, సుమహితరథకేతనము నౌ జూపట్టెఁ గడున్.

వ. ఇట్లనలుండు తామ్రచూడుఁడై పరిశయు ఘనాఘనంబువోలె మహాధ్వనిం
జేసె నప్పుడు హరిబ్రహ్మాదిసకలదివిజగణంబులు సంతుష్టమనస్కులగు
చుఁ గోలాహలంబు లొనర్చి రాసమయంబున. ౧౮౧

తే. అమ్మహాధ్వని యాలించి యసురవరాత్ముఁ, డసురనాథుఁడు మత్సృష్టి
యందు నుండు
నిర్జరౌఘంబు దనమ్రోల నిలచి యిట్లు, చటులకోలాహలంబులు సలుపనగునె!

వ. ఇప్పుడీ వేల్పుమూకల నేపణంచి బాలు నాలంబున దూలించెదం గాక
యని పరితిన భిన్న రథస్థుండై నభస్థలగతుండగుచు దేవతల నుద్దేశించి
కోపంబున శరవర్షంబు పుంఖానుపుంఖంబుగా వర్షించె నట్టియెడ. ౧౮౪

క. విశిఖంబుల విబుధౌఘము, విశకలితంబులుగఁ జేసి విధి! నా
శశిధర సూనుండదనున్, కుశలతతో జరపెద్ద్యా కుంజరు మీఁదన్,

వ. ఇట్లు నభంబునకుం జని మహామహుండైన గుహుండు దేవతల కథయం
బు లోఁపంగి కొండొకదూరంబున వారలనునిచిన వారలును గుమారహ[illegible]
బునఁ దద్దనుజ్ఞ నట్లన యుండి రంతయు, ౧౮౬

క. మ్రోలను శూరుఁడు గుహుఁ గని, శైలింప గణంబు బాఱె నానాదిశలన్
బాలిశుఁడనిలిచె నటుటన, హాలెన్న [illegible] మదీయ బలము చటుల్, ౧౮౭

వ. అని చింతించి నిర్జరారి దారుణంబులగు నారాచంబులు నిగుడించినం గు
మారుండు పరిత్యక్తాస్త్రంబుల సరియుర [illegible] చేసె నిట్లు నవ్వీరు లిరువురు
నద్భుతంబులు భవనజనంబునకుఁ గులాలచక్రంబు కరణి [illegible] పరిభ్రమింపు [illegible]

కుంభభ్రమణంబు సేయుచు నిమిషమాత్రంబున బాతాళంబును భూనభం
బును శైలసాగరంబును జక్రవాళంబులును తమోలోకంబును బ్రహ్మాం
డకటాహంబును సకలదిశలుం జూసి చలంబు బలంబు వాసిం జేసి యులు
సాలపు లెరుంగక పోరు ఘోరంబుగా సలిపి రయ్యెడ. ౧౮౯

క. జలధులు గలగెను మేదిని, చలియించెను దుకూరులయ్యె • శైలంబు లెల్లన్
జలజభవాండకటాహము, దళితంబయ్యెను ధరిత్రిం • దారలు దుల్లెన్. ౧౯౦

ఆ. ఘోరపవనుం డపుడు • ఘోరతమంబయంగ, ఘోరశరచయంబు • గురిసి మిగుల
ప్రళయకాలసమా • బహుళకీల లట్లచు, నిబిడముగను బెగడ • నిఖిలదిశలు.

వ. మఱియునుం బలుమారు నప్పాతమ్మ్యంబును పరశుకులిశ ముసలముద్గరశ
క్తితోమరపరిఘపట్టిసకరవాల లాంగలభిండివాల శూలాద్యాయుధంబు
లుం బ్రయోగించిన నవి యన్నియుఁ గార్తికేయుండు వాయుదేవతా వ
రంబులగు నస్త్రంబుల దునుమాడి వాడి మిగులు పదునాలుగు బాణంబుల
రథాశ్వంబులం బరిమార్చె నప్పుడు. ౧౯౧

క. దళితరథాశ్వంబై ఘన, బలుఁడా దానవుఁడనేక • బాణవ్రాతం
బులు నిగుడించెను గుహుపై, విలసత్క్రోధానలమున • విపులస్మితుఁడై

మ. హరసూనుండు తదస్త్రసంఘములను • ద్యత్ప్రౌఢి ఖండించి దని
ష్ఠురబాణంబులు దైత్యుపైఁ బరపినన్ • శూరుండు తత్సాయకో
త్కరము ల్దోడనె ద్రుంచె నంత సముద • గ్రస్ఫూర్తి నద్దైత్యుపైఁ జా
శరుబాహుద్వయి భాసురాంబకసహా • స్రం జేసె నగ్రింబునన్. ౧౯౩

వ. ఇట్లేసిన మహానలకల్పశరంబులగు నతని బాహువుల్లంబడి యయ్యస్త్రం
బులు పర్వతంబుపయిం గురియు వర్షధారలు వోలె నిరర్థకంబు లయ్యె
నయ్యెడ. ౧౯౪

క. శూరుండనుపమ శౌర్యా, కారుండై రెండు నేల • కాండంబులతో
సారప్రౌఢిమ దనరఁగ, నూరుభుజము లేసి యార్చె • మహా గంభీరతన్.

వ. అమ్మహాసాయకంబులు దేవవాయువుపైఁ బడి భస్మీభూతంబు లయ్యె నట్లగు
టం గనుంగొని దానవేంద్రుండు క్రోధావేశంబునం గనలుచు నతని కి
రుగడల నురువడించు భూతసేనాధిప వీరగణంబులపై ననంతంబులైన నిశా
తశిలీముఖంబులుం బరపె నకిరయంబున. ౧౯౬

క. అమితపరాక్రమధుర్యుం, డమరచమూవల్లభుఁడు తద్దళచక్రచయముల్
తుమురుగఁ జేసె సహస్ర, స్త్రములన్ సతినివిల్లు దునిమెన్ దారుణభంగిన్.

క. దనుజవరేణ్యుం డప్పుడు, ధనువున్ వేఱొకటి పూని ఘోరరథముపయిన్
జనియాకసమున నెలకొని, సునిశితబాణములు నేసె సుబ్రహ్మణ్యున్.

వ. అప్పు డగ్గుహుం డంబరంబునకుం దోడ నెగసి యతనితోడం దలపడియె నంత నసురుండు గయ్యంబు సేయువాఁడ వోలె నంతఁ దోడి మగుడ మాయావియై యదృశ్యసేనావిభుని వంచించి నిమిషంబులోన మహీతలంబునఁ గరుదెంచె నప్పుడు. ౧౯౯

క. శరజన్ముం డనుఁదోడనె, ధరణీతలమునకు వచ్చి దానవుతో భా
సురశౌర్యోన్నతిఁ బోరెను, దురితాత్ముఁ డసుర డంతఁ దుర్దాంతగతిన్.

వ. పాతాళంబును బాధోధియుఁ జక్రవాళంబును మేరునగంబును దిక్పాలకనగరంబులును బ్రహ్మవిష్ణులోకంబులును మాయావియై గ్రుంకుచుఁ గ్రుమ్మరిన. ౨౦౧

క. అందందు భరమమునఁ జని, యిందుకళాధరసుతుండు వెలసి విజయుఁడై
పొందఁగ నిశిచరుతోడన, మందపరాక్రముఁడు సెలఁగి మార్కొని పోరెన్.

ఆ. అండభిత్తి వ్రాత్తి నసురుం దు మజియుచు, విశిఖవృష్టిఁ గురిసె విక్రమమున
నచటి కాత్తుఁ బంబియాదు దెంచి శివసూనుఁ, డతని రథము గూల్చె నంబకముల.

వ. అంత వేఱొండు రథం బెక్కి శూరపద్ముం డనంత శిలీముఖంబుల బ్రహ్మాండబిలవిదారకంబులైన శరజన్ముని శరవిసరంబులు దునుమాడి పూర్వంబట్ల మార్గంబు సంగిన నజాండాంతరంబులనుండి దనుజవ్రజంబులు మొత్తంబులుగా గంతులు వేయుచు నరుదేరం జూచి బ్రహ్మాది దేవత లాత్మగతంబున. ౨౦౪

క. హాలాహలపుంజంబో, కోలాహలమడరవచ్చు కులిశవ్రజమో
కాలాగ్నిధూమతతియో, యాలోకింపగ నిదేమి యద్భుత మొకో. ౨౦౫

వ. వెండియు బ్రహ్మాండకటాహబహిర్జలప్రవాహంబులో యని మనంబున వితర్కించి భయభ్రాంతులై హరిబ్రహ్మాదినిఖిలసురలు దిగంతంబులకుం బరచు నంతలోన నద్దైత్యభటులు పరాక్రమోద్భటులగుచు నత్తారకారిం జుట్టుకొని కట్టలుక బెట్టిదంబులగు శరంబులు గురిసిన. ౨౦౬

క. మందస్మిత మొలకఁగ నొక, బృందాధీశుఁడు గుహుండు భీషణపటిమన్
బృందారక పరిపంథుల, నందఱ గోపాగ్నిశిఖల నవుడు దహించెన్.

వ. ఇట్లు పలుమఱు నడుగుపెంచు నిశాచరబలంబులం గోపవీక్షాగ్ని శిఖలం ద
హించియుఁ జలంబుడుగక మఱియు గుహుండు చక్రదండముసలపరశు క
రవాలంబులు గొని సకలాజాండంబులం గల మహాబలులగు దైత్యుల మ
దాజ్ఞఁ దెగించుమని పంచాయుధంబులం బరపిన నవియు ననంత కోటి మా
ర్తాండ తేజోవిరాజమానంబులును మహారావఘోరంబులునగు నజాండం
బులు సొచ్చి యచ్చోటనుండు రాక్షసతతుల హతంబు గావించె నట్లు సుటుంక
ని శూరుండు మనంబునం గనలుచు సర్వసంహారకంబును సకలచక్రాధి
దైవతంబగు చక్రంబు నిర్వక్రపరాక్రమ ధౌరేయుండగు నబ్బాహులేయు
పయింబరపిన. ౨౦౮

క. శరసంభవుఁడా చక్రము, పరగఁగ నై సాక్షిఁ గొని మోఁ బ్రత్యస్త్రం గో
చరముగఁ బటలీనిదనుజే, శ్వరుఁడుం బరితాపమొందె వారని కినుకన్. ౨౦౯

వ. మాయాశియగుచు ననేకరూపంబులు ధరియించి యుద్ధరాత్ముండు వహ్నిసం
భవుతోడ బవరంబుసేయ సమకట్టిన. ౨౧౦

క. నానారూపయుతుండగు, వానిం గని నగుచు దివిజ వర్యుండు వేగన్
జ్ఞానాస్త్రంబు నిగుడ్చిన, దానన్ గతమాయుఁడగుచు దానవుఁ డలుకన్.

వ. ఒక్కండ నిలిచె నంత హరిబ్రహ్మాదిసకలనిలింపులు హర్షోత్కర్షంబునం బు
ష్పవర్షంబులుం గురియుచుఁ గలకలధ్వనులం జెలంగి రయ్యవసరమున.

క. శూరుండజాండమవ్వలఁ, జేరి రణోద్యోగి యగుచుఁ జేరెను గుహునిన్
ధీరుఁడు సేనానియు దో, స్సారత రాక్షసు నెదిర్చి శౌర్యంబెసగన్.

వ. ఇట్లు గుహుండు నజాండాంతరంబునకుం జని దనుజేంద్రుతోఁ ఘోరఘో
రంబుగా సలిపె మఱియు నందుండి వేఱొండు బ్రహ్మాండంబున కరిగియం
దు నమ్మహాభుజు లిరువురు ననన్యాదృశంబగు జన్యం బన్యోన్యంబొనరించి
రంతయు. ౨౧౪

— బ్రహ్మాండాంతరంబులసంగ్రామ మొనర్చుకుమారస్వామిని గూర్చి దేవతలు దిగులొందుట —

క. ఈరీతినబ్జజాండము, లారూఢిగ సొచ్చికడిమి నయ్యసువురోగిన్
బోరగ నది గని భయమున, వారిజగర్భాదివిబుధ వర్గంబెల్లన్. ౨౧౫

వ. హరిం గని యిట్లనిరి. ౨౦౬

క. గరుడధ్వజ! శూరుండితఁ, డరయఁగ మాయావి దుష్టుఁ • డతి సంచకుఁడై
సురవిభు సుబ్రహ్మణ్యుని, దురమున నకుఁ ఓలిచె మిగుల • దోర్గర్వమునన్.

— విష్ణువు దేవతలకు ధైర్యము చెప్పట. —

వ. తద్వచనంబులు విని దేవదేవుండైన గుహుండు నజాండాంతరంబునకుం జనియె పాపకర్ముం డతివంచకుండు నగు నద్దైత్యు గనుంగొనియెనో, లేదో, కని దురంబొనర్చునెడ జయంబెదెసం గలుగునో యెఱుంగము మనంబున సందియంబు మహాభయంబయ్యెడు నని పలికిన. ౨౦౮

క. వారలవచనము విని మధు, వైరియుఁ దలపోసి గుహుని వైభవ మహిమన్
భూరికుతూహల యుక్తుఁడై, సారసుధాభణితిఁ బలికె • సవభుక్తతతిన్.

క. సురలార! వినుఁడు సాత్త్వ, త్పరశివుఁడా షణ్ముఖుండు • తత్త్వం బెఱయన్
శరవిద్యావైపుణిచేఁ, బెఱుగు మహాబలుఁ డతండు • పోరిఁ దిటలిర్పన్. ౨౧౦

ఆ. దేవవిభుని మహిమ • దెలిసియుండియు మీరు, సందియంబిదేల • చెండములను
నిఖిలపద్మజాండ • నివహముల్ గ్రుమ్మరి, వచ్చు సత్వరముగ • వగవనేల?.

వ. అని యిట్లూరడిలం బలికిన హరివచనంబులు విని సురలు ముదంబునం బొదలి రంత శూరకట్మంతు సకలాండంబు మహాఘోరంబగు సంగరం బొనర్చి మగుడి నిజపురి సమీపంబుఁ జేరి కార్తికేయునిఁ గయ్యంబునకుం బిల్చిన. ౨౧౨

క. శీరమహేంద్రపురంబును, జేరి గుహుండంతఁ దనుజ • సింహునితోడన్
భూరికిఁ దలఁపడెనప్పుడు, దారభుజావిస్ఫురత్ప్ర • తాపప్రౌఢిన్. ౨౧౩

వ. ఇట్లు దలపడినం గనుంగొని దనుజ సైనికులు రోషావేశంబుల బాణవర్షంబులు గురియుచు నొక్కపెట్టం గుహునిం జుట్టుకొనిన. ౨౧౪

క. మందస్మితముఖుఁడై గుహుఁ, డందఱ దెగటార్చె నాజి • నాశుగమునన్.
నంతకధరముఖ్యామర, బృందంబవ్వేళఁ గురిసె • విరులం వేడ్కన్. ౨౧౫

వ. అంత శూరుండు హతులైన నిజసైనికులను సైన్యంబులతోడ సమీపగతుండగు షణ్ముఖునిం గని శోకాకులుండై నీదుకేమి చేయఁగలవాఁడనని కొం తడఁబడవు చింతించి. ౨౧౬

—॥ శూరుండు దుఃఖితుడై తల్లిని స్మరించి యామెతో విచారించుట. ॥—

క. తనజనయిత్రి నిమాయను, ననవధికతపోగరిష్ఠ ॥ నాత్మగుణసుందర్
మనమునఁదలంపనడియర్, దనయునికడ కరుగుదెంచె ॥ దాత్పర్యమునన్.

వ. ఇట్లరుగుదెంచినఁ దల్లిం గని కూర్మి కుమారుఁడగు శూరుండు పదంబులకె రగి హతులగు సిద్దనుజుల మరల బ్రతికింపుమని ప్రార్థించిన నమ్మాయ త నూజున కిట్లనియె. ౨౨౯

—॥ మాయ శూరునికి రాక్షసుల బ్రదికించు నుపాయము చెప్పుట. ॥—

తే. కార్తికేయుండు దలఁపసా ॥ క్షాన్మహేశుఁ, డతనినిందింప వచ్చునే ॥ యతఁ యుగాక
నస్మదుక్తులువిన కింత; యతనితోడఁ, గయ్యముసమఁదొడంగితి ॥ గర్వమునను.

వ. అది గావున నిన్నితండు శక్తిచేత సంహరింపం గలఁడది యట్లుండ నిమ్మ హతులైన దైత్యుల బ్రతికింపవలయు నేని సముద్రంబులోన సుధామయం బగు మందరాచలంబు గలదు. దానిం గొని తెచ్చిన తద్వాయుసంస్పర్శనమున నిమిషమాత్రంబులోన మృతులెల్ల సజీవితు లగుదురని చెప్పి యమ్మా య చనియె నంత. ౨౩౦

—॥ శూరుఁడు మందరాచలంబు దెప్పించి సింహవక్త్రాది దనుజుల నెల్లర బ్రదికించుట ॥—

క. శూరుఁడు తద్వచనము విని, భూరితురంగాలము దనర ॥ బోరన్నతమ స్కం ధరవమావ నమెక్కి యు, దాంత సురలోకరధము ॥ తాఁగని పలికెన్.

వ. నీవు సత్వరంబుగా సాగరంబునకుం జని సుధామందర నగంబుఁ గొని తె మ్మనవుఁడు నదియు నట్లన చని యప్పర్వతంబు శీఘ్రంబ తెచ్చిన నయ్య వసరంబన శూరుపుత్త్రుఁగు భానుకోపప్రముఖులును దత్సోదరులగు సిం హవక్త్రాదులును మఱియుం దక్కిన రక్కసులును దత్పవనంబు సోకిన మా త్రంబున నిద్రమేల్కొనునట్లు లేచి యిదియేమి యుద్ధస్థలంబువలె నున్నద ని పలుకుచు ఘోరంబుగా గోలాహలంబు లొనర్చుచు. ౨౩౧

క. పరిసరపతితాయుధములు, కరముల సంధించి వేగ ॥ గయ్యంబునకున్ దొరకొను నాత్మీయులఁ గని, పరమాహ్లాదమున శూర ॥ పద్మజుండు పుడున్.

వ. ఇంటి లోకరక్షంబు గనుంగొని బహూకరించి నిఖిలదనుజుల నిందించిన న

దియు దూరంబునం గని మహాభయాన్వితులై యింక వీరి బాధ తప్పెనేని య
దియె మనకుఁ బదప్రాప్తి యని పలికి తమతమ యాయుధంబులు విడిచిని
జపదంబుల నిరాశులై కొందఱు చక్రవాకరూపంబులును మయూరాకృ
తులును గొందఱు హంసపారావతశుకపికాద్యాకారంబులు ధరియించి ది
గంతంబులకుం బఱచి రాసమయంబున వీరులు భూతసేనలు సేనాధిపతులు
ను నడలుచు నత్యంతచింతాసాగరంబున మునింగి రంతయు. ౨౩౪

—♦ శూరునాజ్ఞచే దనుజులు కుమారునితో నెదిరించుట ♦—

చ. అది యఖిలంబు సూచి దర ♦ హాసవిభాసుర వక్త్రపద్ముఁడై
సదయుఁడు కార్తికేయుఁ డరు ♦ శౌర్యధురీణుఁడు నిల్చె సచ్ఛటన్
బదపడి శూరునాజ్ఞ బహురూపులు సింహముఖాదిశూరులున్
గదసిరి షణ్ముఖున్ శలభ ♦ కాండము చిచ్చునఁ బోలె నుద్ధతిన్.

వ. ఇట్లు గవిసియద్దురాత్ములు సశితవిశిఖంబులు గుహునిపయిం గురిసి రప్పుడు.

—♦ కుమారస్వామి పాశుపతమున దనుజుల సంహరించుట ♦—

తే. వారియాటోపములు గాంచి ♦ వీరు లెల్ల, భయము చెందిరి గుహుఁ డంత ♦ పా
శుపతము
విమతగర్వాపహరమును ♦ వేగఁ దొడగి, పరపె రణభూమి దానవ ♦ ప్రతతిమీఁద

వ. అది యుదీర్ణమహాసర్పంబులును సుత్సాదితకులిశంబులును సముద్భూతవిషం
బును నుదయదసంతరుద్రవినిద్రితంబును నుజ్జృంభిత దివ్యాస్త్రంబును ను
చ్చావచజలధి కల్లోలజాలంబును నుద్భూత ప్రళయానల కీలంబును నగు
చునరుదెంచి తదస్త్రంబుల నిమిషమాత్రంబునం దునుమాడి యప్పర్వతం
బును జూర్ణంబు చేసి దానవులనెల్ల నొక్కపెట్టన నిర్మూలంబు గావించిమ
రలి నిలింపసేనాని పాణితలంబునొందె నాసమయంబున. ౨౩౮

—♦ కుమార శూరపద్ముల యంతిమ యుద్ధము. ♦—

క. శూరుం డొక్కఁడనిలిచెను, ఘోరణమండలమునందు ♦ నది గనిదివిజుల్
శౌరికమలాసనులతో, భూరితరంబగు ముదంబు ♦ పొందిరిమదిలోన్. ౨౩౯

వ. అంత శూరుండు కోపాటోపంబునం గనలుచు వికటభ్రుకుటి కుటిలేక్షణుం
డై యింద్రలోకరథంబునుం గని వీరలను సకలభూతంబులను సేనాపతు

లం గొని చని యుండ గోళంబున నిలిపి కాచికొనియుండుమని యానతిచ్చి
న నదియు నతిజవంబున వారలనందఱ మోహాక్రాంతులం జేసికొని పోయి
యచ్చోట నునిచికొని యుండె నంత. ౨౪౦

ఆ. శూరపద్ముఁడపుడు • సుప్రీతుఁడయ్యెను, వేల్పులెల్లదుఃఖ • వివశులైరి
సదయహృదయుఁడపరి • జాతినాభవుఁడాత్మ, సకలమదియు నెఱిఁగి సత్వరముగ.

వ. అనేకంబులగు మహాస్త్రంబులఁ బరపిన నవియు నతిరయంబునం జనిత్రదశ
సన్నిహితులగు వారలలేపి యరదంబుతోడన గుహాంతరంబునకుం గొనితె
చ్చె నివిషవగాత్రింబున. ౨౪౨

ఆ. అంత రథము డిగ్గి • యవ్వీర పుంగవుల్, సైన్యవరులు భూత • సంతతులును
కార్తికేయు చరణ • కంజంబులకు మ్రొక్కి, ప్రణుతిజేసి రెలమి • భక్తిదనర.

వ. అయ్యవసరంబునం బరమాత్ముండగు నప్పార్వతేయుం డారథంబునుం గ
ని నీవు దురాత్ముండవు దానవుచెంత కరుగవలదు ఇందే వసింపుమని ప
లికి యయ్యైంద్రలోక రథమును స్తంభింపం జేసె నంత. ౨౪౪

క. శూరుండదిగని కనలుచు, నారాచంబులను గురిసె • నగజసుతుపై
ధీరత గుహుఁడవి యెల్లవి, దారించి శరాళిమఱియుఁ • దద్దయు గురిసెన్.

క. దానవుఁడు గుహుని శస్త్రవి, తానము గళితముగఁ జేసి • తత్సారథినం
తేఁ శితాశుగ వితతులు, నోనాటఁగనేసె కడున • నూన ప్రౌఢిన్. ౨౪౬

వ. తదీయాస్త్రఘాతంబులఁబవనుఁడు రక్తసిక్తాంగుండగుచు రథచోదనంబు
నందు నశక్తుండై యుల్లంబు వక్కి నుల్లంబోమె నయ్యెడ. ౨౪౭

క. కనియదియుఁ గార్తికేయుఁడు, దనుజుని కార్ముకము దునిమె • దారుణశరశ
స్త్రనికాయంబుల నంతట, ననుపమ శౌర్యంబు నూరుఁ • డతిరోషమునన్.

ఆ. సింహవాహనంబు • శీఘ్రింబడిగి శూల, మఖిలరిపువిషాల • మలరఁ బూని
ఘోరతరముగాఁగ • గోలాహలము సేసి, కొనుచునరుగుదెంచె • గుహునిమీఁద.

వ. అప్పుడు తదీయంబగు సింహవాహనంబు గర్జింపుచు షణ్ముఖ రథాశ్వంబుల
హతంబులు గావించె దానవుండును శూలంబు గుహునిపైం బ్రయోగించి
న నదియు ఘోరానల జ్వాలామాలికలును నతికరాళహాలాహల జ్వాలంబు
లును నతిభయదభూతజాలంబులును ననేకాయుధ వ్రాతంబులును నుసృజం
పుచు మహావేగంబునం జనుదెంచు సమయంబున. ౨౫౦

ఆ. గుహుఁడు దానిమీఁద ♦ ఘోరసాయకకోటి, గురిసెనకియుఁగనియ ♦ సర
భసగోనక
వచ్చుచుండమఱియు ♦ వారకఁగులిశంబు, పరపె శివసుతుండు ♦ బాహుపటిమ.

వ. అక్కులిశంబు తదీయశూలంబునుం గరశంబగు నిజముఖంబునం గీలించి గుహునిపాణితలంబు సేరెనప్పుడు సుపర్వులు సంతుష్టాంతరంగు లగుచు.

క. శరజన్మకృపాంభోనిధి, దురితాత్మునిదైత్యునితని ♦ దురమాడి రణో ర్వరమునురక్షించవెన, త్వరముగ ననిపొగడిరీశ ♦ తనయునిభక్తిన్. ౨౧౩

—♦ శూరపద్ముండు విహంగాదిరూపములు ధరించి యాకసమున యుద్ధముసేయుట. ♦—

వ. అయ్యవసరంబున గుహుండు ద్విసహస్రంబులగు ఘోరనారాచంబులు దానవుని వాహనంబుపైఁ బ్రయోగించిన నదియు గతప్రాణంబై నేలం గూలె నసురుండు సంప్రాప్తవాహనుండయ్యును బాలివోని ధైర్యంబున జలంబు నూలుకొలుపుచు భూతలంబుననిలిచి యత్యద్భుతంబునునతి ఘోరంబును నత్యున్నతంబును నగు రథాంగనామక విహంగరూపంబు గైకొని నభంబున కెగసె. ౨౧౪

క. అతితపటుతరపక్షో,ఘాతంబుల సకలభూత ♦ గణములవీర వ్రాతములనెల్ల మోహా, న్వితులఁగావించెఁ జటుల ♦ విక్రమమొసఁగన్.

వ. మఱియు చండప్రహారంబులఁ గొందఱఁ జరఘఘాతంబులఁ గొందఱు గగత జీవులఁ గావింపుచు నుపరితలంబునం భ్రమింపుచు నబ్బాహులేయు సారథి రథరథ్యంబులఁ జంచుఘాతంబులఁ గొట్టి చిదిమి పరిమార్చి వీరాయుధంబు లుభంజించి విహరింపుచుండె నప్పుడు. ౨౧౬

క. అది దైత్యుని చేష్టితమని, మదినెఱిఁగి గుహుండనేక ♦ మార్గణకోటుల్ గదియించిపఠూరుఁడుత, త్ప్రిదరవాంత్రముల నణఁచెఁ ♦ బక్షిహతులన్.

వ. వెండియుఁ దుండంబుల ఖండించియుఁ బాదంబులవిదారించియు మహాజవంబున సరిత్సాగరశైలంబులును జక్రవాళాచలంబులును భూనభంబులును బాతాళంబులును డాయుచుమెలగుచు నిఖిలభూతగణంబుల నీరులను గబళించి మగుడ విక్షేపణంబుల దిగంతంబులు చలింప నిలింపసేనాస్థరథోపరిభాగంబున మహారవంబడర (బరిభ్రమించె నెంతయు. ౨౧౮

క. విహగేంద్రంబును గనుగొని, గుహుం డద్భుతమందిను శరకుసితోరణముల్
విహితము గాదని యద్దాడ, మహిపై దెరువడిగి నిలిచె మానుగ నెదుటన్.

వ. ఇట్లు సవలోకించిన నతండు నయ్యార్యశ్వరు ననుజ్ఞ వడసి యత్యద్భుతంబు
గా మయూర రూపంబు ధరించి నిజస్వామికిం బ్రణమిల్లి వినయంబున ని
ట్లనియె. ౨౬౦

క. వేగము దేవా మదుపరి, భాగంబున నిలిచి దైత్య పరిసృతుత్తోడన్
ప్రాగల్భ్యమలరం బోరుము, నాగుహుం డంగీకరించి నగుచున్ వేడ్కన్.

వ. అమ్మయూరంబు నధిరోహించి కోపంబు గదుర ననక్రపరాక్రమోద్రేకం
బగు చక్రవాకంబుపై బరపిన. ౨౬౧

మ. పటురోషోద్ధతి చక్రవాక మపుడున్ బక్షానిలోద్వృత్తి ది
క్తటముల్ గంపము నొంద నిష్ఠుర నఖ వ్యచ్ఛంచుఘాతంబులన్
జటులప్రౌఢిమ పాదఘట్టనల భా స్వల్లీలం జక్కాడ ను
ద్భటశక్తిన్ మాని మయూరముల్ వెగచి సంతాపంబు నొందెన్మదిన్.

వ. అడియుం గని గాంగేయుండు క్రోధాంతరంగుండై యారథాంగంబు శిరో
వక్షాంఘ్రిప్రదేశంబుల బహునిశిత శిలీముఖంబులు బరపినం దద్బాణఘా
తంబులం బడలి వొడలి రుధిరపూరంబులుం దొరుగం బక్షంబులు విదల్చ
చు నగసి సకలలోకంబులు భయంపడ సంచరించె నంతయు. ౨౬౪

ఉ. తారకవైరి యత్తరిని దగ్రత నెచ్చటనున్న నచ్చటన్
సారెకుం బక్షిపై నిశిత సాయకముల్ గురిసెన్ యుగాంత వి
స్ఫారఘనాఘనంబు క్రియం బయ్యన నంత ఖగంబు పెన్మొగుల్
జేరె ధనుర్విభంజనము సేయంగ డంగి మహాజవంబునన్, ౨౬౫

వ. ఇట్లు సవిధగతంబైన వానింగని మహామహుండైన గుహుండు మండలా
గ్రంబున రెండుఖండంబులు గావించి మహీతలంబునం గడపెన. ౨౬౬

ఆ. మగుడి యద్దురాత్ము డాగి లేచి బ్రహ్మాండ, భిత్తినంటం బెరిగి భీషణము గ
నరుణపదము లంతనని పక్షంబును, నద్దురించె రోష మతిశయిల్ల. ౨౬౭

వ. అప్పు డబ్బలుండు కరాకారంబు గనుంగొని శరజన్ముండు భర్జించుచు నతనిపై
నిశితశిఖంబు లేడుబరపిన నవియు మహాసముద్రరూపంబులగుచు భూమం
డలంబు నిండి తక్షీరసాకారంబు నణంచె నప్పుడు. ౨౬౮

ఆ. అంత నసుఁ డలిగి యంబుధిరూపమై, ఘనతరంగములనఁ గవిసె గుహుని
దానిమీఁద నతఁడు దావానలాంబక, శతము బరపె జేల్చె జలధి నదియు,

వ. అప్పు డన్నిశాచరుండు వహ్నిరూపంబై వహ్నిసంభవు నెదిర్చిన నమ్మ
హానుభావుండు సహస్రవిశిఖంబులుం బ్రయోగించె నవియుం బ్రచండవా
యురూపంబులై తద్వహ్ని జల్లార్చె నంత. ౨౭౦

క. తారకదైత్యుఁడు ఘోరస, మీరాకృతిఁ బూని రాగ మీఁదికి గుహుఁడున్
నారాచంబులు లక్షను, దారతఁ బ్రౌఢిమను బరపెఁ దక్షిణపవియున్.

వ. మహాఘోరసర్పరూపంబులై వానిం గ్రసించె నిట్లు తద్బాణంబు లన్ని
యు దానవు తత్రరూపంబు లన్నియు హరించి సురలం గార్తికేయునిం
జెందె నివ్విధంబున నద్దేవదానవులకు నాల్గుదినంబులు పోరు ఘోరంబుగాఁ
జెల్లె నంత శూరుండు మాయారూపంబున. ౨౭౧

సీ. మూర్తిత్రిరూపకృతిఁ బర్తించు నొక్కడ, నొక్కడ దనుజుఁడై యుక్కు మీఱు
ఇంద్రాదిరూపంబు లింపొందు నొకచోట, నొకచోట భూతమై యుండు నిగుడ
పైశాచరూపమై భాసిల్లు నొకచాయ, నొకచాయ ఘోరపావకుఁడు నగుచు
నంతకాకారమై సలరారు నొకకేరి, నొకకేరి పవనమై యుద్ధ నిల్లు
తే. సుదధి రూపంబు గనుపట్టు నొక్కపట్టు, మేఘరూపంబు నగుచును మెర
యు చాల
నొక్కకడ భూధరంబట్లు నొప్పుమీఱు, శూరుఁ డాహవమున మహాశూ
రుఁ డగుచు. ౨౭౩

వ. వెండియు దిగంతదంతావళరూపంబును శరభసింహశార్దూలమృగవిహంగ
రూపంబులును సింహాస్యతారక భానుకోపాగ్నిముఖాదిరూపంబులును మం
త్రిసేనాపతి రూపంబులును ధరించియు నొక్కొక్కచోట స్వరూపంబు దా
ల్చియు నొకప్రదేశంబున నుండి వేరొక్కదిక్కునం గనుపడుచు నద్దాన
వుండు మహారావంబుల లోకంబు శోకంబు నొందఁ జేయు నయ్యెడ నఖిల
బృందారకులు గాందిశీకులై రంతయు. ౨౭౪

క. సకలం బనియుఁ గనుంగొని, సకలేశుండైన గుహుఁడు సంస్మితుఁడై సా
యకములు సహస్రకోటులు, ప్రకటితముగ దైత్యుమీఁదఁ బరపెఁ గడిమిన్.

వ. తచ్ఛరంబు లన్నియు నద్దురాత్మునొక్కొక్క రూపంబునకు సప్తగుణి తంబులై వేరు వేరం బోరిగొని మగుడి గుహునిం జేర నంత శూరుండొక్కరుం డవశిష్టుండై యుద్దేశంబునం దెంత నిలిచె నంతయు. ౩౭౬

—♦ కుమారస్వామి శూరపద్మాసురునికిం దనవిశ్వరూపంబుం జూపుట. ♦—

క. పరమదయాంబుధి గుహుఁడా, దురితాత్మునిదైత్యుఁజూచి ♦ దోషాచర భా సురనీకుగనీరూపంబుల, బరికించితిజూడుమింక ♦ నారూపంబుల్. ౩౭౭

వ. అని పలికి విబుధాగ్రగణ్యుండైన సుబ్రహ్మణ్యుం డవాఙ్మానసగోచరంబైన విశ్వరూపంబు సూపె నప్పుడు. ౩౭౮

సీ. అంఘ్రితలంబున ♦ నవనీధరంబులు, పాథోధు లేడును ♦ బ్రపదములును
జరణాంగుళులనుకుల ♦ వసుణధైత్యార్కచంద్రులునునంతర్బహిర్గుల్భములును
జంఘలపాదులు ♦ జానువులసురమణి, ఇంద్రజయంతులు ♦ నెలమితొడలు
కటిబంధము లయందు ♦ గాలంబుయముఁడును, గటిసీమవసువులు ♦ గర్భమదనరం

ఆ. బార్శ్వములనసురలు ♦ ఫణులుగుహ్యంబున, శేషనమునసుధయుఁజెలువెసంగ జగదుదయము నాభి ♦ శాస్త్రంబు లురమందు, బ్రహ్మమాధవులును ♦ బా
హువులును. ౩౭౯

వ. మఱియు జ్ఞానంబున యజ్ఞోపవీతంబును గరంబున భోగంబును రోమకూ పంబుల నజాండంబులు నంగుళుల నప్సరసలు కంఠదేశంబున శబ్దంబులువ క్త్రంబున దేవతలు దంతంబుల నక్షరంబులు జిహ్వను శివాగమంబులునో ష్ఠదేశంబున సప్తకోటిమహామంత్రంబులు నాసికను వాయువు నేత్రంబులనిం దుభాస్కరులును శ్రోత్రంబున దిశలును లలాటంబునఁ బ్రణవంబును శిరం బునఁ బరమాత్మయగు సామ్రాజ్యంబును గలిగి యనేకాదిత్య సంకాశ తే జోవిరాజమానంబై నెరికిం దేఁజూడ నలవిగాక నత్యద్భుతంబగు విశ్వరూ పంబు సూపిన. ౩౮౦

క. శరజన్ము విశ్వరూపము, పరికించి సుపర్వులెల్ల ♦ భయమవశి నొంతే శిరముల నంజలి పుటములు, విరచింపుచుఁ జేసిరెలమి ♦ వినుతులుభక్తిన్.

—♦ విశ్వరూప దర్శనంబునఁగలిగిన విజ్ఞానంబుచేత శూరుండుకుమారు నుతించుట. ♦—

వ. అప్పుడు పరమపావనుండును గృపాళుండును నగు షడాననుండు వారలం గ ని భయంబువలదని యాదరించె నంత శూరపద్మాసురుండు తద్విశ్వరూపంబు

విలోకించి తనభాగ్యవశంబున లబ్ధజ్ఞానుఁడగుచు నాత్మగతంబున. ౨౮౩

క. ఘోరముగ దురమొనర్చియు, దారవొ్రిఢిమసమస్తదనుజులఁ గూల్చెన్
ధారుణి నీతని మహిమం, బారూఢిగ సంస్తుతింపఁ నాశ్చర్యమగున్.

వ. అదియునుంగాక ఇందిలోకరథంబితనికి వశంబయ్యె నామాయయాతని మోహిల వ్యర్థంబై చనియె మఱియు ననంతకోటి బ్రహ్మాండకృత నివాసంబును నఖిల సురాసురమానవసహితంబును ననన్యసామాన్యంబునగు రూపంబు సూపె నింతకమున్న కాదే దూతయు సింహాముఖుండును బహువిధంబుల నితని మహామహిమంబుం జెప్పిన వినక మూఢబుద్ధిం జేసి యజ్ఞుండనై యమ్మహామహుని బాలిసుండని తలంచితి నితనిపాదరోమంబుల సకలబ్రహ్మాండంబు గనుపడుచున్నయది. ఇతండు పరమాత్మయగు సాక్షాత్పరశివుండు. సకలచరాచరాత్మకంబైన యితని విశ్వరూపంబాపాదమస్తకంబును నేత్రోత్సవంబు గానవలోకించితి మఱియు నిమ్మహాత్ముని ఘనవధికసౌందర్యంబు గనుంగొనుటకు బుద్ధిబోడమియుడుగకున్నయది ప్రాక్కృతంబగు మత్తపఃఫలంబునం జేసి నాయందుఁ గృపాళుండై యిమ్మహానుభావుండు యుద్ధంబున కరుదెంచె సర్వాంతర్యామియగు నిప్పరమాత్మునకుఁ బ్రదక్షిణనమస్కారస్తోత్రంబు లర్పించుటకు నామనంబు రంజిలుచున్నయది మఱియు నమేయశ్రేయఃప్రాప్తిసూచకంబులగు మదీయంబునగు దక్షిణనేత్రభుజంబులు స్ఫురింపుచున్నయవి. శత్రుసహాయార్థంబుగా నిద్దేవ్రుండరుదెంచి నన్నుం గృతార్థుం జేసె నంతయు. ౨౮౪

క. అరుదెంచె నన్నదురమున, మరియుంపఁగ నిమ్మహాత్ముఁడదిభారము్లో
ధరణిని లీలామాత్రిం, బఱియగ నీదేవవిభునఁ కఖిలాధ్యువర్ణ,

క. దేవవ్రితతికి బంధము, గావించుట వలనకాదెఁగలిగెను నాకీ
దేవవరేణ్యుని పదరా, జీవద్వయ దర్శనంబుఁ శ్రీనుంబలరన్. ౨౮౬

ఆ. కొంద ఱజ్ఞులగుచుఁ గూడదనిరి మున్ను, దివిజబంధనంబుఁ దీనగా చెయుప్పు డితనితోడఁ నేనుయుద్ధముచేసి, పొందఁగంటిజగతిఁ భూరికీర్తి. ౨౮౭

—•-కుమారస్వామిచేనపహృత విజ్ఞానుండగుశూరపద్మాసురుండా కుమారసంహారమునకై దలంచుట.-•—

వ. అనియివ్విధంబున దానవేంద్రుండు వితర్కింపుచుండ నాసమయంబున సుబ్రహ్మణ్యుండు వాని జ్ఞానంబు తోడఁ గూడ విశ్వరూపంబు సంహరించి

ప్రాచీనంబగు నిజరూపంబు గ్రహించె నప్పుడు. ౨౫౦

క. జ్ఞానవిహీనుండగుచుఁ, దానవుఁ డతికోపమడర • దారుణగతినెం
తేని హసింపుచుఁ గరములు, మానుగఁదట్టుచును శౌర్య • మహిమ చెలంగన్.

వ. నాతోఁ గయ్యంబునకుఁ దొడంగ నెవ్వంఁడు సమర్థుండగునని పౌరుషంబు
లుఁ బలుకుచు ననన్యాదృశంబగు మాయారూపంబుగ్రహించినిమిషమాత్రం
బులోనఁ బేరికులగు సుపర్వులం గబళించి బాలకు వధించెదనని మనం
బునం దలంచి దురాత్ముండగు నయ్యసురుండు విధిచోదితుండై. ౨౫౧

మ. జగమెల్లన్ దిమిరంబు నిండఁ గనమ • గ్నిస్ఫూర్తి నత్యద్భుతం
బుగ నేకాంఘ్రు లనేక పాణివదనం • బుల్ భాసిల్లన్ మాయికం
బగు రూపంబు ధరించి యంబరము నందా • దైత్య వర్యుండు దే
వగణంబుల్ వెస మ్రింగ హస్తములు శశ్వత్ప్రీతి సాచ్చెన్ గడున్.

వ. ఆసమయంబున సకలదేవతలు భీతచేతస్కులై భక్తశరణ్యుండగుసుబ్రహ్మ
ణ్యుని శరణుబొందుచు దేవా! దయాసముద్రుండవు భక్తభయపరిదుంధవు
నీవు దనుజభయాకులచిత్తులమగు మమ్మురక్షించి మహాఘోరుండగు నిద్దు
రాత్ముఁ దెగటార్పుమని ప్రలాపించుచు నెల్లఁడం బరచిరి మాయారాకృతి
యగు నింద్రుంకును శౌర్యధైర్యధారేయుండగు నబ్బాహులేయునల్లనం
బ్బార్థించె నయ్యవసరంబున. ౨౫౩

—• కుమారశక్తిచే శూరసమ్మఁడు నేఁగూలుట. •—

క. సురగణముల వచనంబులు, శరజన్ముండాలకించి • సంపూర్ణకృపా
భరితాత్ముఁడగుచు శాత్రవ, హరణోగ్రంబైన శక్తి • నాతుణనుందున్.

వ. అద్దానవుని రూపుతున్నియఁ గావించి రమ్మని పనిపిన నదియు నాదిత్యకో
టిసమప్రభాభాసమానంబై యగ్నికణంబులు గురియుచు మాయారూ
పంబగు తిమిరం బణంచి శూరపద్మపై మందమందగతి నేతెంచు నప్పు
డతండు. ౨౫౫

తే. నాశరహితుండనై నట్టి • నన్ను శక్తి, యేమి సేయఁగఁగలదని • యేపెసంగ
నట్టహాసంబొనర్చుచు • సలగిమిగుల, నుగ్రుఁడగుచుదురాగ్రహ మొదవనప్పు

వ. సకలలోకంబులు సంహరించి నిమిషమాత్రంబున నర్భకుం దెగటార్చెదన
నీ తలంచి సత్వరంబుగాఁ జని సముద్ర మధ్యంబు నొంచి. ౨౫౭

సీ. చటులానలజ్వాలఁ జాలప్రవాళంబు, బహుళధూమచ్ఛటా భాసురంబు
కమనీయకాంచన ఘనపుష్పకలితంబు, శ్యామరక్తశలాటు సంయుతంబు
పద్మరాగోపల భవ్యఫలౌఘంబు, మేఘశాఖావళీ మేదురంబు
పద్మజాండకటాహ పర్యంతగతమూల, మురుతరఛాయమ భ్యున్నతంబు
తే. లక్షయోజనదూరసంలక్ష్యమాన, మగుచు దిక్పాలపురముల నాక్రమించి
బ్రహ్మవిష్ణ్వాదిలోకముల్ భయపడంగ, చూతభూజాకృతిధరించె సురవిరోధి.

వ. అప్పుడు తదీయస్కంధంబుల ఘర్షితంబులగుచు మాతృకన్యాలోకంబులు భయాకులంబయ్యె సకల జగంబులు గంపించె భూతలం బదరె నభోభువన జాలంబులు వణంకె ఆదికూర్మ వరాహానంత దంతావళంబులు సంతాపసంబు నొందె తారకలెల్ల నెల్లెడలం దుల్లె చంద్రసూర్యాది నవగ్రహంబులు గతులు దప్పె నప్పుడు.

ఆ. కాందిశీకులగుచుఁ గొండలు వెవిజులు, మేరుభూధరంబు సేరి రెలమి
కొంద అమరవరులు గొబ్బున కైలాస, పర్వతంబునకును బరువులిడిరి.

వ. ఇట్లద్దురాత్ముని మాయ గని గుహప్రేరితంబైన యాశక్తి కోపంబునఁ బ్రళయకాలాగ్నిసదృశయు మహారావభీషణయు నగుచు నమ్మద్రుంబులు ఘోషిల్ల జనుదెంచి చూతాగ్రంబు రెండు వ్రయ్యలుం జేసిన. 300

ఆ. అంత దానవేంద్రుఁ డాభూరుహాకృతి, దొలఁగి స్వస్వరూపములఁ దాల్చి
కడిమిమెఱయఁ గేలఁ గరవాలముధరించి, యసుగుదేర మొరలనతనిగదిసి.

వ. ఆక్షణం బాశక్తి తద్వక్షంబు నవిదారించి నిజప్రభాజాలంబుల జగంబులు వెలుఁగం జేయుచు మరలి సురగణంబులు నుతింప గంగాతరంగిణి యందుఁ గృతావగాహయై కృతార్థయగుచు దేవదేవుండగు గాంగేయుని పాణితలంబున నిలిచె నంతయు. 301

— భూమిం బడిన శూరుని శరీర ఖండద్వయము బ్రహ్మకుక్కుట రూపంబు నొంది కుమారస్వామిని శరణు వేడుట. —

ఆ. అంత రెండువైనఁ దొలఁగుచు దానవుం డుర్వి, బడిననందు నొకటి బర్హియగుచు
మఱియొకటి బూమ్రచూడమగుచు వేరొక్కటి, వెడలి గుహునికడకు వేగవచ్చె.

వ. అప్పుడవియు లబ్ధజ్ఞానోదయంబులై పరమభక్తిని గార్తికేయునకుం బ్రణమిల్లి సంస్తవంబు లొనరించిన సంతసిల్లి సుబ్రహ్మణ్యుం డింద్రాగ్నిరూపం

బుల బర్హివాహన కుక్కుట కేతనంబుల వీడ్కొని యప్పమ్మయూర వాహ
సం బధిరోహించి యత్తామ్రచూడంబును నిజరథధ్వజంబున నుండ నియో
గించిన నదియు నట్లున నిలిచెఁ బ్రళయాంబుదంబు భంగి మహాభయంకరం
బుగా నినదం బొనరింపుచు. ౩౦౪

మ. గుహునిం బైనిడి భూసభంబులు డిళల్ ♦ గోత్రంబు లంభోనిధుల్
వహితప్రాభిమెఁ జుట్టి సత్వరగతిన్ ♦ బక్షంబులల్లార్చుచున్
విహరించెన్ గడునాశిఖావళము త ♦ ద్వేగంబునన్ మేరువున్
వహివార్లెన్ జలధుల్ గలంగె ధరకం ♦ పంబొందె నెంతేనియున్.

వ. మఱి యుదిగంతంబులనిండఁ ఘీంకారంబు లొనర్చుచు శేష రాహు కేతుప్రము
ఖోరగంబులకు భయం బాపాదింపుచున్న నమ్మయూరంబు నమేఘవాహనంబగు
హరి పరమేశ్వరు నట్లు దేవసేనావల్లభుం డగు సుబ్రహ్మణ్యుండు వహించె.

క. సకల దిగంతములందును, బ్రకటిత జవమొప్పఁ ద్రిప్పి ♦ బర్హిరథంబున్
సకలేశుఁడు గుహుఁడుజవో, త్సుకతన్ రణభూమిఁ జేరె ♦ సురుచిరలీలన్.

వ. అప్పు డాసమరభూమిని వహించిన వాన వాగ్నుల గుహానుజ్ఞం గుక్కుట
బర్హిరూపంబులు విడిచి నిజరూపంబుల శరవణోద్భవునకు భక్తి పూర్వకం
బుగాఁ బ్రణమిల్లి సంస్తుతించిరి. భూతంబులు వీరులు సేనాధి పతులు బ్ర
హ్మ విష్ణుప్రముఖనిఖిల దేవతలును సంతుష్ట హృదయులై దేవదేవునిం బ
రివేష్టించి కోలాహలంబులం జెలంగి రెంతయు. ౩౦౫

క. కరుణాపూరిత దృష్టిన్, హరసూనుఁడు వారినెల్ల ♦ నవలోకించెన్
శరవణ సంభవునాశ్రిత, భరణంబును బొగడదరమె ♦ ఫణిపతికైనన్. ౩౦౬

—♦ శూరుని భార్యలు ప్రాయోపవేశము నొందుట. ♦—

తే. అంతశూరుండుహతుడౌటయాలకించి, పద్మకోమలమొగలైన ♦ పత్నులెల్ల
పతివియోగంబుచే దుఃఖ ♦ భరము నొంది, పావకజ్వాలలందున ♦ బడిరి వేగ.

—♦ తండ్రి మరణంబువిని హిరణ్యుడు దుఃఖించుట. ♦—

వ. శూరపద్మతనయుండు హిరణ్యుండు జనకు మరణంబువిని శోకాక్రాంతుడై.

క. హాతాత! చనితె కడు విన, వైతివి నాపలుకొకింత ♦ హతుఁడవునైద్వి
ట్కేతనమునఁ గుక్కుటమై, యీ తెఱఁగున నుండవలసె ♦ నే నీ విధమున్.

వ. మఱియు మయూరంబవై శత్రునివహించి చెతేయక్కటా యని వగచి యతం
డంత సైనికులుం గసిన బాధింతురని మనంబునఁ జింతించి నిజపురంబుగు

శుక్రునికటంబు జేరితదనంతరకృత్యంబునిర్వర్తించి మైశ్వర్యంబుతృణభంగు
రమునినింపించిమోక్షార్థి యగుచుం బరమేశ్వరు గూర్చి తపంబు సేయు చుం
డె నీకథాశ్రవణంబు సేయువారలకు సుబ్రహ్మణ్య కృపాబలంబున శత్రు
భయంబు దొలంగు బుషి ముఖంబున నేతదాఖ్యానంబు విని విష్ణువు ము
రాసురకాలనేమ్యులంజయించె. ఉపమన్యువలనఁ గృష్ణుండు విని భౌమాదిద
నుజుల నాజిం గెలిచె. పితామహుండగు శుక్రుని వలన విని మునిశ్రేష్ఠుం
డగు దధీచి శత్రుండగు క్షువుని జయించె ననిసూతుండు శౌనకాది మహా
మునులకుఁ జెప్పె నంతయు. ౩౧౩

ఆశ్వాసాంతము.

శా. ప్రాలేయాద్రి సుతాపయోధర తటీ ◆ బాఢోపగూఢక్రియా
లోలాభీకనికామ భాసుర కృపా ◆ లోకైక సంతర్పితా
త్రైలోక్యాఖిల భక్తలోక నిట ◆ లోద్యద్వహ్ని కీలాచ్ఛటా
తూలాపీన పతాకజంతు పటలీ ◆ దుఃఖాబ్ధి సంతారకా. ౩౧౪

క. వ్యాళాభరణ! కరాళ, క్ష్వేళాభ్యవహార నిపుణ! ◆ శీతాంశుకలా!
కాళీసమేత! నిరుపమ, కేళీధృతహారిణ! విబుధ ◆ కీర్తిత చరణా! ౩౧౫

ఖడ్గబంధం.

హరహర తారకాంబు ◆ జరిహరి భూరి భూ
భారతీవకేంది శేశ ◆ భావితాంఘ్రి సారసా
సారమేరుశైలచాప ◆ సర్వలోకవల్లభా
భారతీ ప్రవీణ భృంగి ◆ భవ్యనాట్యలోలుపా!. ౩౧౬

గద్య.

ఇది శ్రీమత్సకల సుకవి జనానుగ్రహ పాత్రి కాశ్యప స గోత్రి
కోడూరి యల్లనార్య పౌత్రి శంకరామాత్య పుత్రి లక్ష్మాంబా
తనయ వినయవిధేయ బాల సరస్వతీ నామాంక వేంక
టాచల కవి ప్రణీతంబైన శ్రీస్కాందంబను మహా
పురాణంబున శంకరసంహితను శివరహస్య
ఖండంబు నందు యుద్ధ కాండంబున
చతుర్థాశ్వాసము
సర్వము సంపూర్ణము.

ఏనగ్రంథః ముదిగొండ రామలింగ శర్మణా తాళిదళ సంపుటాత్ లిఖితస్సన్ పరమేశ్వ
ప్రీతయే అక్షయ నామసంవత్సర ఆశ్వీజ బహుళ పంచమ్యాం భానువాసరే సమాప్తి మగమత్.

రాఁబోవు గ్రంథ రత్నములు.

# దేవకాండము. - దక్షకాండము.

ఇవి స్కాంద మహా పురాణాంతర్గత శంకర సంహితలోని శివరహస్య ఖండంబున గల అయిదారు కాండములు. బాలసరస్వతీ బిరుదాంకితులైన కౌమారి వేంకటాచల కవి ప్రణీతములే. కవిత్వము రసవంతము. క్రమముగా బస్వ కావ్యమగు శివరహస్య ఖండ సంపూర్తియు ముద్రించ బడును. వలయువారు శైవప్రచారిణీ గ్రంథమాలకు చందాదారులుగా చేరుటలాభకరము.

సంపాదకులు.



శైవప్రచారిణీ గ్రంథమాల యందు ముందు ప్రకటింపఁబడు

## గ్రంథ రత్నములు.

1 శివాద్వైత కల్పలతిక ... శాంభవా రాధ్యులు.
2 సిద్ధాంతోత్తర కౌముది.... ముదిగొండ వీరభద్రారాధ్యులు.
3 శివజ్ఞాన శేఖరము 3-4 సంపుటములు ... ఘంటనామాత్యులు.
4 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర ... సంస్కృతము.
5 నందికేశ్వర పురాణము. „
6 శైవసిద్ధాంతదర్శిని 3వ సంపుటము 4వ సంపుటము. 5వ సంపుటము
7 బసవపురాణము సంస్కృతము.
8 శివాధిక్య శిఖామణి ... రేణుకారాధ్యులు.
9 శ్వేతాశ్వతర కల్పసూత్రము ... శ్వేతాశ్వతరుడు.
10 విష్ణుకృత మహిమ్నస్తోత్రము సవ్యాఖ్యానము మ॥ వీరనారాధ్యులు.
11 శివరహస్య ఖండము సంస్కృతము అసుర కాండ, వీరమహేంద్ర కాండ, యుద్ధ కాండ, దేవ కాండ, దక్ష కాండ, ఉపదేశ కాండలు,
12 శైవరత్నాకరము. ... జ్యోతిర్నాథుడు.
13 శైవసంజీవిని. ... సిద్ధయోగి.
14 శైవపంచకము. ...



## వరంగల్ - శైవ ప్రచారిణీ కార్యాలయమున

వెలకు దొరకు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1 | కాశీసారము. ... | 0-[illegible] |
| 2 | భద్రీయ రుద్రాఖ్యానము. ... | 0-12-0 |
| 3 | విద్యాస్థానవినిర్ణయము. ... | 0-12-0 |
| 4 | శైవసిద్ధాంత దర్శిని. ... | 1-8-0 |
| 5 | ఉపదేశ కాండము. ... | 3-[illegible]-0 |
| 6 | సరస హృదయానురంజనము. ... | 2-0-0 |
| 7 | స్కాంధమహా పురాణము సంభవ కాండము సంస్కృతము తాత్పర్యముతో సహా ... | 3-8-0 |
| 8 | సంభవ కాండము వచనము. ... | 1-4-0 |
| 9 | సోమవార వ్రతకల్పము. ... | 1-8-0 |
| 10 | సత్వమధురము. ... | 1-[illegible]-0 |
| 11 | వీరభద్రాష్టోత్తర శతనామావళి. ... | 0-4-0 |
| 12 | వీరభద్రస్తోత్రకదంబము. ... | 0-12-0 |
| 13 | భక్తపాల శతకము. ... | 0-2-0 |
| 14 | శరభాంకలింగశతకము. ... | 0-4-0 |
| 15 | గీతగౌరీశ కావ్యము. ... | 0-8-0 |
| 16 | అగ్నిముఖము జయాదులు. ... | 0-4-0 |
| 17 | విఘ్నేశ్వరపూజ - పుణ్యాహవాచనము ... | 0-2-0 |
| 18 | శివయోగసారము 1 వ భాగము. ... | 1-4-0 |
| 19 | " 2 వ భాగము. ... | 1-4-0 |
| 20 | " 3 వ భాగము. ... | 1-4-0 |
| 21 | " 4 వ భాగము. ... | 1-4-0 |
| 22 | ఆహ్నికకాండ నాలుగు భాగములు. ... | 5-0-0 |
| 23 | శివజ్ఞాన శేఖరము ప్రథమ భాగము. ... | 1-4-0 |
| 24 | శివజ్ఞాన శేఖరము ద్వితీయ భాగము. ... | 1-4-0 |
| 25 | ప్రతాపరుద్ర చరిత్రము. ... | 0-12-0 |
| 26 | లింగధారణదీపిక. ... | 1-0-0 |
| 27 | బసవవిజయము. ... | 0-12-0 |
| 28 | యుద్ధకాండము. పద్యకావ్యము. ... | 2-8-0 |